## తొలి పలుకు

గానశాస్త్రోపాధ్యాయులకును, గానశాస్త్రాభ్యాసకుల కును అత్యంతవాంఛనీయమైన "గానశాస్త్రప్రశ్నోత్తరావళి" అను గ్రంథమును గానకళాభిమానులందఱ కెఱుకపరచుటకు నేనెంతయు సంతసించుచున్నాను. నేనీపుస్తకము నామూలా గ్రముగ పరిశీలించియుండుటచే గానశాస్త్రమునకు సంబంధించి న గవర్నమెంటుటెక్నికల్ పరీక్షలందే గాక తదితర వివిధగాన పరీక్షలలోను జయముపొందగోరు గానకళావిద్యార్థుల అక్కఱ లనీపుస్తకము తప్పక నీడేర్పునని నేను విశ్వసించుచున్నాను. గ్రంథకర్తయగు శ్రీయుత అరిపిరాల సత్యనారాయణమూర్తి గారు కళాభిజ్ఞత, కళాసామర్థ్యము గలిగిన బహుగ్రంథద్రష్టల గు పండితులు. వారుఅమూల్యమగు **గానకళాచంద్రిక** యను గ్రంథము నొకటిరచించి యిదివరకే విశేషకీర్తి నార్జించియుండిరి. వారి ద్వితీయ గ్రంథమగు యీ **గానశాస్త్ర ప్రశ్నోత్తరావళి** ఆంధ్రదేశములో గానకళాభివృద్ధికి వారు నిరంతరకృషిపరులనె డి కీర్తిని ద్విగుణీకృతమొనర్చుచున్నది.

విద్యార్థిలోకమునకు మిగుల సహాయకారియగు నిట్టి గ్రంథమును రచింపవలెననెడి నూతనభావము యీగ్రంథకర్త కుస్ఫురించినందులకు విద్యార్థిలోకమువారికెంతయుఋణపడియు న్నారు. గానకళకు సంబంధించిన సంస్థలన్నియు అమూల్యమ గు వారిగ్రంథఫలితములననుభవించి వారికిదగినప్రోత్సాహమొ సగుదురని నేనుమిక్కిలి ఆశించుచున్నాను.

29-6-1937 **ద్వారం వెంకటస్వామి**

జయనగరము. ప్రిన్సిపాల్, విజయనగరం మహారాజావారి గానకళాశాల

# ఉపోద్ఘాతము

లలిత కళలన్నిటిలో నత్యుత్తమమును, ధర్మార్థకామ మోక్షదాయకమునగు కర్ణాటక గానకళ యిటీవల ప్రభుత్వమువారి దృష్టినాకర్షించుటముదావహము. "టెక్నికల్" సంగీతపరీక్షలలో నుత్తీర్ణులైనవారే గానకళాధ్యాపకులగుట కర్హులని ప్రభుత్వమువారు నిర్ణయించుటచే నట్టిపదవులనొందగోరు సంగీతజ్ఞులీపరీక్షలందు కృతార్థులగుట విధిగానేర్పడినది.

ప్రభుత్వమువారు తామేర్పరచిన వివిధ గానకళాపరీక్షలందు లక్ష్యభాగమునకేగాక లక్షణభాగమునకుగూడ తగుస్థానమునిచ్చియుండుటచే ప్రాచీనసంప్రదాయమైన లక్షణవివరములను పరిశోధింపజాలని గానకళాస్థులకీపరీక్షలయందుత్తీర్ణులగుట మిక్కిలికష్టసాధ్యమైనది. అట్టిగానకళాపరీక్షార్థులకుపయుక్తమగునటుల తత్పరీక్షా సంబంధమగు ప్రశ్నోత్తరావళినొకటి ప్రకటింపుడని టెక్నికల్‌పరీక్షార్థులును నామొదటి గ్రంథమైన "గానకళాచంద్రిక"ను పరిశీలించినవివిధమండలీయులునగుసంగీతజ్ఞులును పలుసార్లునన్ను ప్రోత్సహించుటచేకలిగినఉత్సాహమున **గానశాస్త్ర ప్రశ్నోత్తరావళి** యనుపేర నీగ్రంథమును ప్రకటింప సాహసించితిని.

ఇందు 1930 సం॥ము మొదలు 1936 సం॥ము వరకు గవర్నమెంటు టెక్నికల్ పరీక్షలలో హయ్యరుగ్రేడ్‌వారికొసగిన థియరీప్రశ్నాపత్రములలోని ప్రశ్నలన్నిటికి సమగ్రముగాను, సవిమర్శకముగాను, సముచితముగాను నాశక్తివంచనలేకుండజవాబులువ్రాసితిని. మరియునిందు ఆయా ప్రశ్నలకనుగుణముగ

ఉదాహరణములును, రాగలక్షణములును, తాళవివరములును, ముఖ్యవాగ్గేయకారకుల జీవితచరిత్రములును, సంగీతత్రిమూర్తుల గు త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిలయొక్క చిత్రరువులును, సంగీతవాద్యములగు వీణ, ఫిడీల్, (వయొలిన్) గోటు, తంబుర, మొదలగువానియొక్క చిత్రయుతమగు వ్యాసములును వాద్యవిభాగములగు, శృతి, లయ, సంగీతవాద్యవివరములాదిగాగల మొత్తము 100 ప్రశ్నల కుత్తరములను తగుసులభశైలిని వ్రాయబడుటచే టెక్నికల్ సంగీతపరీక్షాభ్యర్థులకేగాక వివిధగానకళాపరీక్షలకేగు వారికి గూడ యీగ్రంథము మిక్కిలి ప్రయోజనకారియగునని నేనాశించు చున్నాను.

లక్షణ యుక్తమైనగ్రంథమగుటచే నిందుప్రమాదజనితమైన దోషములేవేనియున్న గుణగ్రహణ పారీణులగుపండితులువానిని దెలిపిన వినయముగానందికొని పునర్ముద్రణమున సవరణజేసికొందునని మనవి.

నాగ్రంథమును తగువిచక్షణతో పరిశీలించి, నన్నీప్రయత్నమందు మిక్కిలి ప్రోత్సాహపరచి నాకెంతయు తోడ్పడిన శ్రీ విజయనగరము మహారాజావారి గానకళాశాల ప్రిన్సిపాలు గారగు మ. రా. రా. శ్రీ. ద్వారం వెంకటస్వామి నాయుడుగారికి నేనెంతయు కృతజ్ఞుడను.

ఈగ్రంథమును తగు శీఘ్రకాలములో నచ్చొత్తి ప్రకటింప జేసిన గానకళాభిమానులగు మెస్సర్సు ది డెక్కన్ ప్రింటింగువర్క్సు, పబ్లిషర్సు వారెంతయు ప్రశంసనీయులు.

గ్రంథకర్త

# మదరాసు గవర్నమెంటు టెక్నికల్ ఎగ్జామినేషన్సు

## ఇండియన్ మ్యూజిక్ సిలబస్

## **హయ్యర్ గ్రేడ్ ఎగ్జామినేషన్**

### **థియరీ**

1. పారిభాషికపదములు:— అన్యస్వరము, పూర్వాంగము ఉత్తరాంగము.
2. కె. వి. శ్రీనివాస అయ్యంగారి సంగీతపుస్తకములలోను, పి. సాంబమూర్తిగారి కర్ణాటక సంగీతగ్రంథములలోను చెప్పబడిన స,రి,గ,మ సంఖ్యామానముయొక్క పద్ధతులు.
3. కర్ణాటకసంగీతములోని రాగవిభజన. (72) డెబ్బదిరెండు మేళకర్తరాగముల పట్టిక.
4. (35) ముప్పదియైదు తాళముల పట్టిక.
5. ఈదిగువ కనుపఱచినవివిధసంగీతరచనల సంపూర్ణజ్ఞానము.
   1. గీతము
   2. తానవర్ణము
   3. పదవర్ణము
   4. కృతి
   5. రాగమాలిక
   6. పదము
6. ఈదిగువ పేర్కొనబడిన రచయితలు, వారి జీవితములు, వారు కర్ణాటక గానకళాభివృద్ధికొనరించిన కృషి మొదలగునవి తెల్పు కర్ణాటక సంగీతచరిత్రను గురించినజ్ఞానము.
   1. జయదేవుడు
   2. పురందర విఠలుడు
   3. సోమనాథుడు
   4. తీర్థనారాయణస్వామి
   7. క్షేత్రజ్ఞుడు
   8. ముద్దుస్వామి దీక్షితులు
   9. త్యాగరాజు
   10. శ్యామశాస్త్రి

5. భద్రాచలరామదాసు 11. అరుణాచల కవిరాయర్
6. వెంకటమఖి 12. గోపాలకృష్ణభారతి

7. ఈదిగువనున్న 20 రాగముల లక్షణములును,ఒక్కొక్కరాగమునకు సంబంధించిన ఒకరచననుగూర్చిన జ్ఞానము.

| | |
|---|---|
| 1. తోడి | 11. సహానా |
| 2. ధన్యాసి | 12. శంకరాభరణము |
| 3. సావేరి | 13. హంసధ్వని |
| 4. భైరవి | 14. బిలహరి |
| 5. ఖరహరప్రియ | 15. బేగడ |
| 6. ముఖారి | 16 నీలాంబరి |
| 7. హరికాంభోజి | 17. కామవర్ధని |
| 8. కాంభోజి | 18. పూర్వకల్యాణి |
| 9. మోహన | 19. కల్యాణి |
| 10. కేదారగౌళ | 20. సారంగ |

8. సంగీతవాద్యముల విభజన:- తంత్రీవాద్యములు, గాలివాద్యములు, చర్మవాద్యములు, వీణ, వయొలిన్, (ఫిడీలు) తంబుర, గోటువాద్యములనుగురించిన జ్ఞానము.

## ప్రాక్టికల్

1. థియరీ 7వ పేరాలోచెప్పబడిన 20రాగములలోగలరచనలను పాడుటకును, లేక వాయించుటకునుసమర్థతగలిగియుండుట.

అభ్యర్థులు ఈదిగువ కనుపఱచిన తాళములలో ఒక్కొక్క దానిలో ఒక్కొక్క రచననైన పాడగల లేక వాయింపగల సమర్థులై యుండవలెను.

1. ఆది 2. రూపకము 3. త్రిపుట 4. ఝంప 5. చాపు.

2. ఈ దిగువ పేర్కొనబడిన 8 రాగములయొక్క ఆలాపన.
1. తోడి 2. సావేరి 3. భైరవి 4. కాంభోజి 5. మోహన
6. కేదారగౌళ 7. శంకరాభరణము 8. కల్యాణి.

3. (1) పైన చెప్పబడిన 20 రాగములలో స,రి,గ,మ సంఖ్యామానములో యింతవరకు విద్యార్థికి తెలియనిరచనను పాడుటకును లేక వాయించుటకును, మరియు
(2) పాడబడిన లేక వాయింపబడిన సంగీతపదజాలముయొక్క స్వరములను చెప్పుటకును సామర్థ్యము గలిగియుండుట.

ప్రాక్టికల్ పరీక్షలలో విద్యార్థులందరు తంబుర శృతిని బట్టిపాడవలెను.



## ఈ గ్రంథము నందుపయోగించి యుండు గురుతుల వివరము.

| గుర్తులు. | వివరములు. | గుర్తులు. | వివరములు. |
|---|---|---|---|
| ప. | పల్లవి | చ. | చతుశ్రుతి |
| అ. | అనుపల్లవి | ష. | షట్ఛ్రుతి |
| చ. | చరణము | సా. | సాధారణ |
| చి. | చిట్టస్వరము | అం. | అంతర |
| ఉ. | ఉదాహరణము | ప్ర. | ప్రతి |
| తి. | తిశ్రజాతి | కై. | కైశికీ |
| చ. | చతురశ్రజాతి | కా. | కాకలీ |
| ఖం. | ఖండజాతి | ఆ. | ఆరోహణము |
| మి. | మిశ్రజాతి | అ. | అవరోహణము |
| సం. | సంకీర్ణజాతి | , | ఒకకళ |

| గుర్తులు. | వివరములు. |
|---|---|
| స. | షడ్జము |
| రి. | రిషభము |
| రి1. | శుద్ధరిషభము |
| రి2. | చతుశ్రుతిరిషభము |
| రి3. | షట్శ్రుతిరిషభము |
| గ. | గాంధారము |
| గ1. | శుద్ధగాంధారము |
| గ2. | సాధారణగాంధారము |
| గ3. | అంతరగాంధారము |
| మ. | మధ్యమము |
| మ1. | శుద్ధమధ్యమము |
| మ2. | ప్రతిమధ్యమము |
| ప. | పంచమము |
| ధ. | ధైవతము |
| ధ1. | శుద్ధధైవతము |
| ధ2. | చతుశ్శ్రుతిధైవతము |
| ధ3. | షట్శ్రుతిధైవతము |
| ని. | నిషాదము |
| ని1. | శుద్ధనిషాదము |
| ని2. | కైశికీనిషాదము |
| ని3. | కాకలీనిషాదము |
| శు. | శుద్ధ |

| గుర్తులు. | వివరములు. |
|---|---|
| ; | రెండుకళలు |
| — | మధ్యమకాలము |
| == | ద్రుతకాలము |
| \| | తాళఘాత |
| \|\| | తాళఆవర్తాంత్యము |
| * | తాళమునందుసంగీతము ప్రారంభించు తావు (ఎడుపు) |
| - | జాతివిభాగము |
| ,, | పైవిధము |
| ~~ | గమకము |
| ప̣ | మంద్రస్థాయి(క్రిందిచుక్క) |
| ప̇ | తారస్థాయి (పైచుక్క) |
| ◡ | అనుద్రుతము |
| O | ద్రుతము |
| 3 | త్రిశ్రలఘువు |
| 4 | చతురశ్రలఘువు |
| 5 | ఖండలఘువు |
| 7 | మిశ్రలఘువు |
| 9 | సంకీర్ణలఘువు |



# Government Technical Examinations.

## November 1930.

## Indian Music (Theory)–Higer Grade.

### ప్రశ్నలు

1. ఈ క్రింది భాగములను వివరముగా వ్రాయుము:—
స్వర, గ్రహ, న్యాస, అంశ, వాది, సంవాది, గతి, జతి.

2.(a) రాగమనగానేమి? వివరముగా వ్రాయుము.

(b) వెంకట మఖియొక్క మేళకర్త రాగములయొక్క పద్ధతిని వివరముగా వ్రాయుము.

3. జన్యరాగములనగానేమి? వాటిని వేరు వేరుగా భాగించి అట్లు భాగించుటలో వచ్చు తప్పులను వ్రాయుము.

4.(a) చాపు తాళమును గురించి నీకు తెలిసినంతవరకు వ్రాయుము.

(b) త్రిపుట తాళమునకు దీనికిగల వ్యత్యాసమును వ్రాయుము.

5. నీవు చదివిన గ్రంథములను బట్టి త్యాగరాజు, ముద్దుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి వీరికి గల పోలికా పోలికలను నిర్ణయించుము.

6. కృతి, కీర్తన, పదం, జావళి యీ నాల్గింటికి గల తారతమ్యములను దెలుపుము.

7. ఈ క్రింద వ్రాయబడిన రాగములకు లక్షణములు వ్రాయుము.
1బిలహరి, 2కాంభోజి, 3సహాన, 4తోడి, 5భైరవి, 6బేగడ.

8. నీవు చదివినటువంటి పాటలలో సహాన, లేక శంకరాభరణము రాగములలో యేదైన నొకపాట యొక్క పల్లవి, అనుపల్లవులను కర్నాటక ఫక్కీలోనికిమార్చి వ్రాయుము.

9. కర్నాటక సంగీతమునకు గోపాలకృష్ణ భారతి, అరుణాచల కవిరాయరు, రామనాడు శ్రీనివాస అయ్యంగార్లు యెంత పాటుపడిరో ప్రశంసింపుము.



## జవాబులు

**1.** (i) స్వరమనగా? శ్రుతులు విడివిడిగాను వ్యక్తము గాను శబ్దింపవుగనుక వ్యక్తముగ వినదగినదియును యింపుగలది యునుగానుండునటుల పూర్వాచార్యులు శృతులనుపంచి రంజన ముగల అక్షరములతో నీశ్రుతులనుజేర్చి పలికింపబడియుండుట యే స్వరమనబడును. ఇట్టి స్వరములు 7. అవి యేవనగా:- షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము లనునవి. వీనినే సప్తస్వరములందురు. (స్వరమనగా స్వ=స్వయముగా రం=రంజింపజేయునది) అని యర్థము.

(ii) గ్రహమనగా? ఒక రాగము మొదట ఏస్వరముచే గ్రహింపబడుచున్నదో అట్టిస్వరమును గ్రహస్వర మనబడును. (గ్రహము=గ్రహించుట) లేక ఎత్తుటయని అర్థము. రాగలక్షణ ములందు ఒక్కొక్క రాగమునకు ఒక్కొక్క స్వరము గ్రహము గా విధింపబడి యుండును. అనగా షడ్జగ్రహమనియు, ధైవత గ్రహమనియు యిటుల రాగములకు గ్రహస్వరము యేస్వరము గానున్నను యీరాగము మొదట షడ్జస్వర స్థానమునుంచియే ప్రారంభింపవలెను. ఇట్లు గ్రహస్వరము పాడుట 400 సంవత్సర ములకు ముందు ఏర్పడియున్న సంప్రదాయమై యున్నది.

(iii) న్యాసమనగా? ఒక రాగమునుపాడునపుడు అదియే స్వరముచే ముగింప బడుచున్నదో అట్టిస్వరమును న్యాస స్వ రమని చెప్పబడును.

(iv) అంశమనగా? ఒకరాగమును పాడునప్పుడు ఆరాగముయొక్క రంజనమును (రక్తి) ప్రకాశింపజేయునదియు, రాజువలె ముఖ్యముగ నున్నదియు, నగుస్వరమును అంశస్వరమనబడును. దీనినే జీవస్వరమనిగూడ చెప్పబడును.

(v) వాదియనగా? ఒకరాగమునందుగల అంశ (జీవ) స్వరమును బోలి మాటిమాటికి నుపయోగింపబడు స్వరమును వాదిస్వరమని చెప్పబడును. ఇది రాజునకు సదృశమైనదిగా నుండును.

(vi) సంవాదియనగా? రెండుస్వరముల నడుమ 8 గాని లేక 12 గాని శ్రుతులుండిన అట్టి రెండు స్వరములు పరస్పరము (ఒకటికొకటి) సంవాదులనబడును. ఈ సంవాదిస్వరము వాదియగు రాజునకు మంత్రిని బోలునదిగా నుండును. ఉ॥ శుద్ధస్వరములలో(స-మ$^1$)(స-ప)(రి$^1$-ధ$^1$)(గ$^1$-ని$^1$) యునువికృతిస్వరములలో(గ$^2$-ని$^2$) (గ$^3$-ని$^3$)యును(రి$^1$-మ$^2$)ఇవి పరస్పరము సంవాదులగును. అయితే (మ$^1$-ని$^1$) వీనినడుమ 8 శృతులున్నను పరస్పరము సంవాదులు కానేరవు.

(vii) గతియనగా? తాళ సంబంధమగు విశ్లేషము. అనగా తాళమునందు కళలు నడుచువిధమునకు గతియని పేరు. జాతులకువలె యీ గతులకుకూడ చతురశ్రాది పంచభేదములున్నవి. తాళమునందు ఒకయక్షరకాలమునకు పై దెలిపినటుల కళలు 3, 4, 5, 7, 9 యిటుల నడచుచుండుటచే గతిభేదము కలుగుచున్నది. గనుక కళలు మారిన గతియును మారును.

కళలయొక్క నడకనే గతియని చెప్పబడును. ఇవి 5 విధములుగా నున్నవి. ఉ॥ త్రిశ్రగతి, చతురశ్రగతి, ఖండగతి, మిశ్రగతి, సంకీర్ణగతి అనునవి.

(viii) జతిఅనగా? తక, తరి, కిట, నక, తఝం, గిణ, తోం, అను తాళప్రత్యయములుగల రచనకు పేరు.

**2.** (a) రాగమనగా? "రంజక స్వర సందర్భో రాగ యిత్యభిధీయతే" యను ప్రమాణము ననుసరించి, వినువారిచిత్తమును సుఖపరచి యిచ్ఛను జనించునటులజేయు స్వరవర్ణముల చేరికయే రాగమనబడును. (రాగము=ఆస) ఈరాగము అనునది గ్రహ, అంశ, మంద్ర, తార, న్యాస, అపన్యాస, సన్యాస, విన్యాస, బహుత్వ, అల్పత్వములను పది లక్షణములను గలిగి యుండును.

(b) వెంకటమఖిగారియొక్క మేళకర్త రాగపద్ధతి యెటులనగా? సప్తస్వరములు ప్రకృతి వికృతి భేదములచే యేర్పడు 16 స్వరములకు వెంకటమఖివారు వరుసగా *స, ర, రి, గ, రు, గి, గు, మ, మి, ప, ధ, ధి, న, ధు, ని, ను, యను సంకేతాక్షరములను కల్పించి యున్నారు. అట్టి సంకేతాక్షరములైన ప్రకృతి వికృతి

---

* వెంకటమఖివారి సంకేతాక్షరములలో స, ప=షడ్జ, పంచమములనియు
ర, రి, రు= ఋషభములోని 1–2–3భేదములనియు
గ, గి, గు= గాంధారములోని 1–2–3భేదములనియు
మ, మి=మధ్యమములోని 1–2భేదములనియు
ధ, ధి, ధు=ధైవతములోని 1–2–3భేదములనియు
న, ని, ను=నిషాదములోని 1–2–3భేదములనియు గ్రహింపదగును.

భేదముల మార్పులవలననే మేళకర్తలు 72గా యేర్పడుచున్న వివరమును ఈ క్రిందను దెలుపబడుట గమనించునది.

సప్తస్వర సంకేతములనబడు "స,రి,గ,మ,ప,ధ,ని" యను యేడక్షరములును రెండుభాగములుగా భాగింపబడి అందు "స,రి,గ,మ" యను మొదటిభాగమునకు పూర్వాంగమనియు, "ప,ధ,ని" యను రెండవ భాగమునకు ఉత్తరాంగమనియు జెప్పబడును. పూర్వాంగమగు, "సరిగమ"లోని ప్రకృతి(శుద్ధ) వికృతి భేదములలో శుద్ధస్వరములగు, షడ్జ, శుద్ధఋషభ, శుద్ధ గాంధార, శుద్ధ మధ్యమములును ఉత్తరాంగమగు "పధని"లోని ప్రకృతి(శుద్ధ) వికృతిభేదములలో శుద్ధస్వరములగు పంచమ, శుద్ధ ధైవత, శుద్ధనిషాదములును చేరి యేర్పడునట్టిశుద్ధస్వరసప్తకమువలన గలుగునది యొకమేళమగును. ఇదేవిధమున పూర్వాంగము యొక్క శుద్ధస్వరములచే ఉత్తరాంగము యొక్క శుద్ధ, వికృతి స్వరములను ప్రస్తరించిన ఆరు మేళములగు విధమును వెంకటమఖివారి సంకేతాక్షరములతో నీ క్రింద దెలుపబడుట గమనించునది.

పూర్వాంగము-ఉత్తరాంగము

| | | | |
|---|---|---|---|
| (1) సరగమ | పధన | (1) సరగమ పధన | యీ ఆరు మేళలును "సరగమ" యను పూర్వాంగముచేఉత్తరాంగమును ప్రస్తరించగా ఏర్పడినవి. |
| | పధని | (2) సరగమ పధని | |
| | పధను అనగా | (3) సరగమ పధను | |
| | పధిని | (4) సరగమ పధిని | |
| | పధిను | (5) సరగమ పధిను | |
| | పధును | (6) సరగమ పధును | |

పైని దెలుపబడిన విధమున అనగా

(1) సరగమ యను పూర్వాంగభేదముచే ఉత్తరాంగభేదముల ప్రస్తరించిన 6 మేళములును

| | | | | |
|---|---|---|---|---|
| (2) సరగిమ | ,, | ,, | 6 | ,, |
| (3) సరగుమ | ,, | ,, | 6 | ,, |
| (4) సరిగిమ | ,, | ,, | 6 | ,, |
| (5) సరిగుమ | ,, | ,, | 6 | ,, |
| (6) సరుగుమ | ,, | ,, | 6 | ,, |

యేర్పడుచున్నవి. అనగా ఒక్కొక్క పూర్వాంగ భేదమునకు 6 మేళకర్తలవంతున, 6 పూర్వాంగ భేదములకు 6×6=36 మేళములు, "మ" అను శుద్ధమధ్యమ ప్రస్తారముచే గలిగెను. వీనినే పూర్వమేళములనబడును. ఇదేవిధమున పై 36 మేళములను "మి" అను ప్రతిమధ్యమ ప్రస్తారముచే మరియొక 36 మేళములు కలిగెను వీనినే ఉత్తరమేళములందురు. గనుక మ, మి, యను శుద్ధమధ్యమ, ప్రతిమధ్యమ ప్రస్తారములచే 36×2=72 మేళములు యేర్పడుచున్నవనియు యింతకంటెను హెచ్చింపను తగ్గింపను పరమ శివునికైనను సాధ్యముగాదనియు వెంకటమఖివారు జెప్పియున్నారు. ఇదేవారి మేళకర్త రాగముల పద్ధతి.

**3.** జన్యరాగములనగా? మేళకర్తలనబడు 72 జనక రాగములలో నేరాగమునుండియైన జనించురాగములను జన్య రాగములనబడును. ఈ జన్యరాగములు అవిజనించు జనకరాగ శృతులనే సహజముగా గలిగియుండి ఒక్కొక్క జనక రాగమునకు 484 జన్యరాగములవంతున జనించుచున్నవి. ఎటులనగా? సంపూర్ణభేదము 1, షాడవభేదములు 6, ఔడవభేదములు 15,

మొత్తం 1+6+15=22 భేదములు యేర్పడి మరల నవి సం పూర్ణషాడవ, ఔడవసంయోగముల నొందునపుడు సంపూర్ణ సంపూర్ణ భేదము 1యును,సంపూర్ణ షాడవభేదములు6ను, షాడవసంపూర్ణ భేదములు 6ను, సంపూర్ణఔడవభేదములు 15ను, ఔడవసంపూర్ణభేదములు 15ను,షాడవ షాడవభేదములు 36ను, షాడవఔడవ భేదములు 90ను, ఔడవషాడవభేదములు 90ను, ఔడవ ఔడవ భేదములు 225ను, మొత్తం, 1+6+6+15+15+36+90+90+225=484జన్యరాగములు యేర్పడుచున్నవి. ఇటుల ఒక్కొక్క జనక రాగమునకు 484 జన్య రాగములు యేర్పడుటవలన 72 మేళకర్తలకు 72×484=34,848 జన్యరాగము లేర్పడుచున్నవి.

జన్యరాగములను వేరు వేరుగాభాగించుటచే వచ్చుతప్పులేమనగా? (i) ఈ జన్యరాగములలో కొన్నిటియందు అవిపుట్టు జనకరాగస్వరములనేగాక అన్యరాగాంగ(జనక) రాగస్వరము(అన్యస్వరము) లను ప్రయోగింపబడుచున్నవి.(ii)జనక రాగములకువలె మూర్ఛనారోహణావరోహణ స్వరములు సంపూర్ణముగనేగాక కొన్నిటిలో ఔడవషాడవ భేదములనొంది యున్నవి. (iii) జనకరాగములకులేని మరికొన్ని యితర వర్జ, వక్ర సంచారములుకూడ వీనియందు జేర్పబడుచున్నవి. గనుక జన్యరాగములను వేరువేరుగాభాగించుటవల్లనే జనకరాగములయొక్క సహజ లక్షణములకువిరుద్ధమగు కొన్ని అన్యస్వర ప్రయోగములు కొన్నిసంచారములు ఈ జన్యరాగములందు జేర్పబడుటకు వీలగుచున్నది. ఇవే జన్యరాగములను వేరు వేరుగా భాగించుటలో వచ్చు తప్పులు.

**4**(a) చాపుతాళమనగా? తాళప్రకరణమునందు జెప్పబడిన శాస్త్రసమ్మతమగు ముప్పదియైదు తాళములుగాక శాస్త్రమునందు జెప్పబడని వేరునామములతోను క్రియలతోను అనగా మధ్యలోపించిన అక్షరకాలమును కలదై రెండు ఘాతలు (దెబ్బలు) కలిగియుండి వాడబడుచున్న తాళమును చాపుతాళమనబడును. ఇది మూడు విధములు. వీనియొక్క నామములును దెబ్బలును అక్షరములును ఉదాహరణముల నీ క్రిందను దెలుపబడుట గమనించునది.

| నామములు | దెబ్బలు | అక్షరములు | ఉదాహరణములు |
|---|---|---|---|
| 1 మిశ్రచాపు | 2 | 7 | స రి గ। స రి గ మ॥ |
| 2 ఖండచాపు | 2 | 5 | స రి। స రి గ॥ |
| 3 త్రిశ్రచాపు | 2 | 3 | స। రి గ॥ |

అనగా?

మిశ్రచాపుకు మొదటి దెబ్బకు 3 మాత్రలు రెండవ దెబ్బకు 4 మాత్రలు
ఖండచాపుకు మొదటి దెబ్బకు 2 మాత్రలు రెండవ దెబ్బకు 3 మాత్రలు
త్రిశ్రచాపుకు మొదటి దెబ్బకు 1 మాత్ర రెండవ దెబ్బకు 2 మాత్రలుండును

పైని దెలిపినటుల చాపుతాళములు మూడువిధములుగా వాడబడుచున్నవి.

(b) త్రిపుట తాళమునకు చాపుతాళమునకు గలభేదమేమనగా:—

(i) త్రిపుటయనగా ఇది జాతినిబట్టి 5 విధములుగా నున్నను సర్వసాధారణముగా త్రిశ్రజాతి త్రిపుటతాళముగా నెంచుటయే వాడుకయందుండుటచేతను చాపుఅనగా మిశ్రచాపుతాళముగానే పరిగణింతురుగనుకను ఈరెండుతాళములకును

అక్షరసంఖ్య సమానముగానే యున్నను అంగములయందుమా ర్పుజెందియున్నది.

(ii) త్రిపుట తాళమునకు 1 లఘువు 2 ద్రుతములు కలిగి మొత్తము 1+2=3 అంగములుగలవు. చాపుతాళమునకు అంగములుగాలేక 2 ఘాతలు మాత్రము గలవు.

(iii) త్రిపుటతాళమునకు గల 7 అక్షరములను వేయుటలో 1లఘువునందు 3 అక్షరములును 2ద్రుతములయందు 4 అక్షరములును వేయబడుచున్నవి.

చాపుతాళమునకు గల 7 అక్షరములను వేయుటలో మొదటిఘాత (దెబ్బ) వేసి రెండక్షరకాలమువరకును, రెండవ ఘాతవేసి మూడక్షర కాలము వరకును నిలిపియుంచవలెను.

గనుక పైని దెలుపబడినటుల త్రిపుటతాళమునకు గల 7 అక్షరములలో స రి గ। స రి। గ మ॥ యను విధమున 3 అంగములుగ వేసిన త్రిశ్రజాతి త్రిపుటతాళమనియు, స రి గ। స రి గ మ॥ యనువిధమున 2 దెబ్బలుగావేసిన చాపు లేక మిశ్రచాపు తాళమనియు చెప్పబడును. కొందరు వీలుకొరకు అప్పుడప్పుడు చాపుతాళమును వేయునపుడు రెండువరుసదెబ్బలకు బదులు ఒకవిసర్జితములో 3 అక్షరములును ఒక దెబ్బలో 4 అక్షరములును లెక్కపెట్టుదురు.

**5.** త్యాగరాజు? ముద్దుస్వామిదీక్షితులు? శ్యామ శాస్త్రికిగల పోలికలు ఏవనగా:—

(i) ఈ ముగ్గురును దక్షిణదేశమునగలతంజావూరుజిల్లా లోని "తిరువారూరు" అను గ్రామమున జనించిరి.

(ii) ఈ గాయకత్రయము వరుసగా (త్యాగయ్య 1759 - 1847.) (దీక్షితులు 1775-1835.) (శ్యామశాస్త్రి 1763-1827.) కాలమునాటి వారగుటచే ఒక శతాబ్దము (1750-1850.) లోనివారై యున్నారు.

(iii) ఈ ముగ్గురును బ్రాహ్మణులును సమకాలికులు నై యున్నారు.

(iv) ఈముగ్గురును సంస్కృతాంధ్రములందును, వేద సంగీత, జ్యోతిష శాస్త్రములందును మిక్కిలి ప్రతిభగల పండితులై యున్నారు.

(v) ఈ ముగ్గురును దైవోపాసకులగుటచే దేవతాప్రసన్నమునొందిన మహనీయులై యున్నారు.

(vi) ఈ పండితత్రయము వరుసగా (త్యాగయ్య-నారదమహర్షిని) (దీక్షితులు-చిదంబరనాథయోగిని) (శ్యామశాస్త్రి-సంగీతస్వామిని) సేవించిసద్గురుకటాక్షమునసంగీతలక్ష్య లక్షణములనేకముగ గ్రహించిన వారై యున్నారు.

(vii) ఈ ముగ్గురును దైవానుగ్రహము పొందినవారగుటచే వందలకొలది కృతులను రచించియున్నారు.

(viii) ఈ కవిత్రయము కల్పించిన అపూర్వరాగము

లును, భావపూరితములగు కృతులును, హృదయరంజకమగు గానకళాకౌశలమును, చరిత్రాత్మకములునై యున్నవి.

(ix) ఈ బ్రాహ్మణత్రయము మిక్కిలి నైష్ఠికులును మహాభక్తులు నై యున్నారు.

(x) వీరు ముగ్గురును "నిగ్రహ" "అనుగ్రహ" శక్తులు గలిగినవారై యున్నారు.

(xi) ఈ ముగ్గురును నిజసంగీతామృతమును చవిచూచిన ధన్యులై యున్నారు.

(xii) ఈ భక్తత్రయము చేసిన కొన్ని యద్భుతకార్యముల వలన వీరిమహిమలను వెల్లడించిన వారైరి.

(xiii) ఈముగ్గురియొక్క అచంచలమగు భక్తిని పరిశోధింపబడుటకో యనునట్లును, పతివ్రతలందరకువలెను వీరియొక్క భార్యలు వీరికంటె ముందుగనే స్వర్గస్థులైరి.

(xiv) ఈ ముగ్గురుగాయకశిఖామణులును తమచేరచింపబడిన కృతులను శిష్యపరంపరలచే లోకమున వెదజల్లించిన సంగీతోద్ధారకులై యున్నారు.

(xv) ఈ ముగ్గురు భక్తశిఖామణులు తమ మరణకాలమును గుర్తెరింగినవారగుటచే శిష్య, బంధు, మిత్రాదులకు దెలియబరచి గడువుకాలమునందే భౌతికశరీరము విడనాడి స్వర్గలోకమలంకరించిన మహనీయులైయున్నారు.

పైదెలిపిన విషయములవలన యీముప్పుగు వాగ్గేయ కారకులును అనేక విషయములలో పోలిక గలిగినవారుగా నున్నారు.

త్యాగయ్య, దీక్షితులు, శ్యామశాస్త్రిలకు గల భేదములు యేవనగా:—

(i) త్యాగయ్య ములికినాడు బ్రాహ్మణుడు
దీక్షితులు అరవ బ్రాహ్మణుడు
శ్యామశాస్త్రి "వడ దేశత్తువాదమల్" అను తెగకు చెందిన బ్రాహ్మణుడు

(ii) త్యాగయ్య, దీక్షితులు సహజముగా బీదకుటుంబములోనివారు. శ్యామశాస్త్రి సహజముగా పిత్రార్జితమైన భూవసతిగలవాడు.

(iii) త్యాగరాజు శ్రీరామోపాసకులై 96,00,00,000 రామనామము జపించిరి. దీక్షిత, శ్యామశాస్త్రిలు శ్రీవిద్యా, ఉపాసకులైనను 96 కోట్లు జపించినటుల దెలియుట లేదు.

iv) త్యాగరాజు 2,400 కృతులవరకు రచియించి యున్నటుల దెలియుచున్నది. దీక్షిత, శ్యామశాస్త్రిలు చెరి 300 కృతులను మాత్రమే రచించి యుండునటుల దెలియుచున్నది.

(v) త్యాగరాజు తమయొక్క కృతులు కీర్తనములలో విశేషభాగము ఒక కథాసందర్భము ననుసరించియే రచించి యుండిరి.

దీక్షిత, శ్యామశాస్త్రులు తమ యొక్క కృతులను ఒక కథాసందర్భము ననుసరించకనే రచించియుండిరి.

(vi) త్యాగరాజు మహాభక్తుడగుటయే గాక వాల్మీకాంశసంభూతుడని చెప్పుటకు వారి రామాయణకథాసందర్భమగు 24,000 శ్లోకములకు వీరి 24,000 కీర్తనములే సహేతుకములుగా నుండియున్నవి.

దీక్షితశ్యామశాస్త్రులు మహాభక్తులుగను భగవదానుగ్రహాపాత్రులుగ మాత్రమే చెప్పబడుచున్నారు.

(vii) త్యాగరాజు తమకీర్తన పరంపరలచే భగవంతుని మాత్రము కీర్తించినేగాని మానవమాత్రునికీర్తించకున్నటుల కొన్ని దృష్టాంతరములు కనుపడుచున్నవి.

దీక్షిత శ్యామశాస్త్రులు తమ కీర్తనాదులచే దేవదేవులనే గాక మానవమాత్రులను నయితము కీర్తించినటుల దెలియుచున్నది.

(viii) త్యాగరాజు తమమరణకాలమును గుర్తెరింగిన పిమ్మట సన్యసించెను.

దీక్షిత, శ్యామశాస్త్రులు తమ మరణ కాలమునకు ముందు సన్యసించియుండలేదు.

(ix) త్యాగరాజుచే రచింపబడిన కృతులు తెలుగు, సంస్కృత భాషలందుండి సాహిత్య పరిచయములేని వార

లకు సయితము గ్రాహ్యముగునటుల సరళ శైలిగను భావ యుక్తముగను చిన్నవిగను యుండి ద్రాక్షాపాకముగా నుండును.

దీక్షితులచే రచింపబడిన కృతులు, తెలుగు, అరవము, సంస్కృత భాషలయందుండి సంగీత సాహిత్యపరిచయము గల వారు మాత్రమే గ్రహింప గలుగునటుల కఠిన శైలిగను పెద్దవిగను యుండి నారికేళపాకముగా నుండును.

శ్యామశాస్త్రిచే రచింపబడిన కృతులు దేవీపరముగా నుండి తెలుగు, సంస్కృత భాషలందుండి సంగీత సాహిత్య జ్ఞానముగల వారికిమాత్రమే గ్రాహ్యముగునటుల కఠిన శైలిలో నుండి కదళీపాకముగా నుండును.

(x) త్యాగరాజు, కృతులనేగాక దివ్యనామ సంకీర్తన ములు, ఉత్సవ సంప్రదాయ కీర్తనలు, మరియు ప్రహ్లాదభక్త విజయము, నౌకాచరిత్రము మొదలగు గ్రంథములను రచించెను.

దీక్షిత శ్యామశాస్త్రులు కృతులనుమాత్రమే రచించిరి గాని తదితర కీర్తనలుగాని, గ్రంథములుగాని రచించినటుల కనుపడుటలేదు.

(xi) త్యాగరాజున కెప్పుడును పదునైదుమంది శిష్యు లుండి పలుదిశలకు పోయి విద్యాప్రదర్శనముచేసి గురువులకు కీర్తితెచ్చుటచేతను అతనియొక్క రచనల రాగభావ సంపత్తు

లచేతను వీరి కృతులు లోకమున మిక్కిలి ప్రచారములో నున్నవి.

దీక్షితుల కృతులు కఠిన శైలిగను విశేషభాగము సంస్కృతమున నుండుటచే శిష్యులు, వంశీయులవలన కొంతవరకే ప్రచారములోనున్నవి.

శ్యామశాస్త్రి యెక్కువమంది శిష్యులను చేరదీయక పోవుటచేతను కృతులు క్లిష్టమగునవి యగుటచేతను వారి కృతులు యెక్కువ ప్రచారము లేకయున్నవి.

(xii) శ్యామశాస్త్రి, మాంజి, కలగడ, చింతామణి యిత్యాది అపూర్వరాగములు కల్పించెను.

త్యాగయ్య, దీక్షితులచే అట్టి అపూర్వ రాగములు సృష్టింపబడినటుల కనుపడుటలేదు.

(xiii) త్యాగయ్యకు నారదమహర్షి వలన "స్వరార్ణవ" మను సంగీత గ్రంథరాజము బహూకరింపబడెను.

దీక్షిత, శ్యామశాస్త్రిల కట్టి గ్రంథరాజములే మహర్షులవల్లను బహూకరింపబడలేదు.

(xiv) త్యాగరాజు యొక్క గాత్ర మతి మధురమగుటచే గాత్రజ్ఞుడగుటయేగాక వైణికుడుగా తెలియుచున్నది.

దీక్షిత శ్యామశాస్త్రిలు గాత్రజ్ఞులేగాని జంత్రవాద్యములందు ప్రవేశమున్నటుల తెలియుటలేదు.

(xv) త్యాగరాజు సిద్ధిజెందిన "తిరువైయ్యారు" గ్రామమునందును, తదితర యనేక పట్టణములందును వారి వర్ధంతి మహోత్సవమును భక్తితోను అతివైభవముతోను గాయకులందరు సలుపుచున్నారు.

దీక్షిత, శ్యామశాస్త్రిలు స్వర్గస్థులైన తావులందుగాని తదితర చోట్లగాని వారి సంవత్సరీకోత్సవములట్లు వైభవముగా గాయకులు జరుపుటలేదు.

(xvi) త్యాగరాజు సిద్ధిజెందినతావున గొప్ప సమాధి కట్టబడి నేటికిని నిత్యధూపదీప నైవేద్యాదులు జరుగుచున్నవి.

దీక్షిత, శ్యామశాస్త్రిల కట్టి సమాధులుగాని, తదితరములగు ఆలయములుగాని నిత్య ధూపదీప నైవేద్యాదులుగాని యేర్పడియుండలేదు. ఇవే వీరి ముగ్గురికిగల భేదములు.

**6.** కృతి, కీర్తన, పదము, జావళి వీనికిగల తారతమ్యమేమనగా?

(i) కృతి యొక్క మాతువు (సాహిత్యము) భక్తిరసముగానుండుటయే గాక శృంగార రసముగా కూడనుండును.

కీర్తన యొక్క మాతువు (సాహిత్యము) కేవలము భక్తిరసముగనే యుండును.

(ii) కృతికి, ముఖ్యముగా పల్లవి, అనుపల్లవి, చరణములను మూడు అంగములుండును. అయితే కొన్ని కృతులు చిట్ట

స్వరము, స్వరసాహిత్యము, మధ్యమకాల సాహిత్యములను ముఖ్యముకాని అంగములను కూడ కలిగి యుండును. చిట్ట స్వరము, 2, 4 లేక అంతకంటె నెక్కువ ఆవర్తములను కలిగి మధ్యమకాలములో నుండి కొన్ని సమయములలో అనులోమ విలోమక్రమముగా పాడబడును. ఇట్టి చిట్టస్వరముగల కృతికి, ముఖ్య ఉదా:- రఘువంశసుధ. కదనకుతూహలము రాగము ఆదితాళము. (పట్నం సుబ్రహ్మణ్యఅయ్యర్ విరచితము.) కృతులు రచించినవారిలో ముఖ్యులు:— త్యాగరాజు, ముద్దుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రి, సుబ్బరాయశాస్త్రి, మైసూరు సదాశివరావు, పట్నం సుబ్రహ్మణ్యఅయ్యర్ మొదలగువారు.

కీర్తనకు పల్లవి, అనుపల్లవి, చరణములను మూడు అంగములుమాత్రమే యుండును. ఇట్టికీర్తనకు, ముఖ్యఉదా:- ఎన్న గానురామభజన. కామవర్ధనిరాగము. రూపకతాళము. (భద్రాచల రామదాసువిరచితము) కొన్నికీర్తనలు పల్లవి, చరణములనుమాత్రము గలిగియుండును. త్యాగరాజులవారి దివ్యనామ సంకీర్తనలలో కొన్ని యీ తరగతిలోనివై యున్నవి.

కీర్తనలు రచించినవారిలో ముఖ్యులు:- పురందరవిఠల్, భద్రాచలరామదాసు, అరుణాచలకవిరాయర్, గోపాలకృష్ణభారతి, కవికుంజరభారతి మొదలగువారు.

(iii) పదము అనునది పాండితీప్రతిభగల యొకగొప్ప రచన. ఇందు గంభీరమైన వేదాంతార్థము యిమిడియుండి మనస్సును ఆకర్షింపజేయునదిగా నుండును.

పదమునకు పల్లవి, అనుపల్లవి, చరణములుగలిగి అందలిమాతువు శృంగారరస ప్రధానమై నాయకానాయకి లక్షణవ్యవహారాదులు గలిగి పల్లవినందుకొనెడి అనుపల్లవ చరణమాతువు (సాహిత్యము) లనుకల్గియుండును. అనుపల్లవ, మూడవ చరణములందుగాని లేక మూడవ చరణమందే గాని నాయకి ముద్రలుగలిగి చౌకకాలముగా పాడదగి యుండును. ఇట్టిపదమునకు ముఖ్యఉదా: —అలిగితే భాగ్యమాయెను.హుసేనిరాగము,త్రిపుటతాళము(క్షేత్రీయ విరచితము.) పదములు రచించిన వారిలో ముఖ్యులు. క్షేత్రీయులు, ఘనంసీనయ్య, పరిమళరంగ, సారంగపాణి, గోవిందసామయ్య మొదలగువారు.

(iv)జావళికిసాధారణముగా పదముయొక్క లక్షణములేగలిగియుండి గ్రామ్యగానమునకుసంబంధించి మనస్సును ఆకర్షింపజేయునదిగానుండును.ఇందలిమాతువుశృంగారరసప్రధానమై నాయకానాయకిలక్షణములుగలిగియుండి మధ్యమకాలముగాపాడదగియుండును.ఇట్టిజావళికిముఖ్యఉదా:-ఏమిమాయము జేసిపోతివి,కాంభోజిరాగము.రూపకతాళము(పట్టాభిరామయ్యవిరచితము.)జావళీలువ్రాసినవారిలో ముఖ్యులు. ధర్మపురిసుబ్బరాయర్,పట్టాభిరామయ్య,పట్నంసుబ్రహ్మణ్యఅయ్యర్,రామ్నాడు శ్రీనివాస అయ్యంగారు మొదలగువారు. పై దెలిపిన విషయయములే యీ నాల్గింటికిగల తారతమ్యములుగా నున్నవి.

**7.** (i) బిలహరి రాగలక్షణము:— ఇది 29వ మేళకర్తయగు ధీరశంకరాభరణ రాగమున జనించినజన్యరాగము.

ఆరోహణము:— స రి$^{2}$ గ$^{3}$ ప ధ$^{2}$ స.

అవరోహణము:—స ని$^{3}$ ధ$^{2}$ ప మ$^{1}$ గ$^{3}$ రి$^{2}$ స.

భాషాంగరాగము. ఔడవ సంపూర్ణరాగము. షడ్జగ్రహము. గమక వరీక రాగము. రక్తిరాగము. ఉదయము 6 గంటలు మొదలు 9 గంటలవరకు గానము సేయదగును. ఈ రాగమున రిషభ, ధైవత, నిషాదములు రాగఛ్ఛాయా స్వరములుగానున్నవి. ఈ రాగమున పధని$^{2}$ధపా అను ఆరోహణ సంచారమందు కైశికీనిషాదము బలుకును.ఇదే ఈరాగమునకు అన్యస్వరప్రయోగము.ఈరాగమునందు ససరిరిగగపప, గగపప ధధసస మొదలగు జంటస్వరప్రయోగములును,ధగరిససిధపా-రిగధపా మొదలగు దాటు స్వరప్రయోగములును వచ్చుటచేత మిగుల రంజింపబడుచున్నది. ఇందుగల ముఖ్యసంచారములు:-

సరిగపామగరీ-గపధసాసా-సనిసిధసా-సరిగపమగరీసా-సనిధప ధా-రిసనిధపా-పధపధని$^{2}$ధపా-మగరీ-రిగధపా-మగరి-సరిగప మగరీసా-సనినిధసా- మొదలగునవి.

(ii) కాంభోజిరాగలక్షణము:— ఇది 28వ మేళకర్త యగు హరికాంభోజిరాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:— స రి$^{2}$ గ$^{3}$ మ$^{1}$ ప ధ$^{2}$ స.

అవరోహణము:— స ని$^{2}$ ధ$^{2}$ ప మ$^{1}$ గ$^{3}$ రి$^{2}$ స.

భాషాంగరాగము. షాడవ సంపూర్ణరాగము. షడ్జగ్రహము. సర్వస్వర గమక వరీకరాగము. రక్తిరాగము. ఎల్లప్పుడును గానము సేయదగును. ఈరాగమున మధ్యమ, ధైవత, నిషాదములు రాగచ్ఛాయా స్వరములుగానున్నవి. ఈరాగమున సని³పధసా అను సంచారమందు కాకలీ నిషాదము బలుకును. ఇదే ఈరాగమునకు అన్యస్వర ప్రయోగమును, తీవ్రస్వరప్రయోగమునైయున్నది. ఈరాగమున రిపమగస-రిమగస-ధగరిస, మొదలగు దాటుస్వర ప్రయోగములు వచ్చుట చేత రంజింపబడుచున్నది. ఇది పెద్దరాగములలోనొకటైయున్నది. ఇందుగలముఖ్యసంచారములు:—

సరిగమపధసా-సనిధరిసనిధపా-పధమాగా-పధాసాసని³పా-

పధసధసా-సనిధాపా-మగ పధాసా-సరిసీధా-పధసరిగా-గామ

గరీ-సరిగామగరీసా-సనిధా-పధరిసనిధపా-ధపామగరీ-సరిగమ

పా-మగరీసా-సనిధపా-మగపధాసా-సని³పా-పధసధసా-ధరీసా.

మొదలగునవి.

(iii)సహాన రాగలక్షణము:—ఇది 28వ మేళకర్తయగు హరికాంభోజి రాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:— సరి²గ³మ¹ పమ¹ధా²ని²స.

అవరోహణము:—స నీ²ధ²ప మ¹గా²మ¹రీ²గ³రి²స.

భాషాంగరాగము. వక్రరాగము. షడ్జగ్రహము. దేశీయరాగము. ఎల్లప్పుడును గానముసేయదగును. ఈరాగమున ఆరోహణమున పంచమము వక్రమై అవరోహణమునందుగల దీర్ఘ, నిషాద,గాంధారములు కంపితముగలిగియుండును. ఈ రాగములో కొన్ని తావులందు అనగా, సనీధపమగా$^2$మరీగరిస, అనుసంచారమందుగల మొదటి గాంధారము సాధారణగాంధారముగ బలుకును. ఈ అన్యస్వర ప్రయోగమువల్లనే ఇది భాషాంగరాగమని చెప్పబడుచున్నది. ఇందుగలదీర్ఘస్వర ప్రయోగ సంచారములు.

రీగామపామా-పమధానీసా-రీగమా-గమగామరీగరిసా-రినీస ధానిధపా-రీగమపధనీధపా-మగా$^2$మరీగరిసా-నిసధపమాధాని సా-నిరీసా-మొదలగునవి.

(iv) తోడిరాగలక్షణము:—ఇది 8వ, మేళకర్తయగు హనుమత్తోడి రాగమున జనించిన జన్యరాగము. ఇది కర్నాటక రాగముగాదనియు,ఉత్తరహిందూదేశమునుండి తేబడినదగుటచే ఔత్తరరాగమనియు వెంకటమఖివారుజెప్పియున్నారు.

ఆరోహణము:— స రి$^1$ గ$^2$ మ$^1$ ధ$^1$ ని$^2$ స.

అవరోహణము:—స ని$^2$ ధ$^1$ మ$^1$ గ$^2$ రి$^1$ స.

పై విధమున నీరాగమున పంచమము వర్జమై షాడవ రాగముగనున్నను, వెంకటమఖివారేగాక త్యాగరాజాది తది

తర వాగ్గేయకారకులుసహితము నీరాగమునఆరోహణ అవరోహణములందుపంచమము వాడుచు నేరచించియుండుటచే ప్రస్తుత కాలమునందుగూడపంచమమునువిశేషముగ నేవాడుచున్నారు.

ఉపాంగరాగము, షడ్జగ్రహము, సర్వ స్వరగమకవరీక రాగము, రక్తిరాగము. ఎల్లప్పుడు గానము సేయదగును. ఇది పెద్దరాగములలో నొకటియైయున్నది. ఈరాగమున గాంధార మధ్యమ, ధైవతములు రాగచ్ఛాయాస్వరములుగా నున్నవి. మరియునీరాగమున గగ మమ ధధ, మమ ధధ నిని. మొదల గుజంటస్వర ప్రయోగములును నిగరిని-ధనిరినిధమ-గమని ధమగారిసా మొదలగు దాటుస్వర ప్రయోగములునువచ్చుటచేత మిక్కిలి రంజింపబడుచున్నది.

ఇందుగల ముఖ్య సంచారములు:—

ధనిసాసానిధా-పధనిసరిగారిసా-రిసనిధా-ధనిసరిగమగారిసా-సనిధాపా-మగమపధనీధపా-పమగా-గమధనిధమగారిసా-సగరిస నిధనీసా-నిగారిసా మొదలగునవి.

(v) భైరవి రాగ లక్షణము:—ఇది 20వ, మేళకర్త యగు నటభైరవిరాగమున జనించిన జన్యరాగము. ఇది మొదట ఉపాంగము, లేక శుద్ధరాగముగా నుండి వెంకటమఖి వారి కాలమునుండి క్రమముగా ఆరోహణమున చతుశ్శ్రుతిధైవతముచేర్చబడుటచే నిది భాషాంగరాగమైనది. పూర్వీకులు

ఈభైరవిని ప్రాచీన ప్రసిద్ధ మేళములగు 19లో 7వ మేళముగా జేర్చియున్నటుల దెలియుచున్నది.

ఆరోహణము:—స రి$^2$ గ$^2$ మ$^1$ ప ధ$^2$ ని$^2$ స.

అవరోహణము:—స ని$^2$ ధ$^1$ ప మ$^1$ గ$^2$ రి$^2$ స.

భాషాంగరాగము. సంపూర్ణ రాగము. షడ్జగ్రహము. సర్వస్వరగమకవరీక రాగము.రక్తి రాగములలోనిది మిగులశ్రేష్టమైనరాగము. వెంకటమఖివారు సాయంకాలరాగమనిచెప్పియున్నను అన్ని వేళలందును గానము సేయదగిన రాగమనియే ప్రస్తుతకాలమున వాడుచున్నారు. ఈ రాగమున రిషభ గాంధార, మధ్యమ, నిషాదములు రాగచ్ఛాయా స్వరములు గానున్నను,ప్రసిద్ధమైన రచనలు చాలవరకు నిషాద,రిషభ స్వరములమీదనే ప్రారంభింపబడియున్నవి. ఈరాగమున,రిరిగగ మమగగ మొదలగు జంటస్వర ప్రయోగములును నిగరిగసరి నిరిసరినిస-మపమనిధప మొదలగు దాటుస్వర ప్రయోగములు నువచ్చుటచేత మిగులరంజింప బడుచున్నది. ఈ రాగమున పధ$^2$నిస-నిధ$^2$నిస-పధ$^2$నిసరీ అనెడిఆరోహణసంచారములందుచతుశ్రుతిధైవతముబలుకును. ఈ అన్యస్వర ప్రయోగమువలననే ఇదిభాషాంగరాగమైనది. పధనిధపా-అను సంచారమునందును పంచమమువరకు బోవు తదితరఅవరోహణ సంచారములందును శుద్ధధైవతము బలుకును. ఇది పెద్దరాగములలో శ్రేష్టమైనదియై యున్నది. ఇందు గల ముఖ్యసంచారములు:-

రిగమపధ²నిసాసా-సరిసనీ ధా²-ధ²నిసరిగరీ-రిగమగగరిసా-సరిగరి సానీధా²-నిసనిగారిసా-సనిరిసనీధపా-మపధ²నిసా-సరిసీధపా-మ పమనీధపా-మపగారిసా-రిగమపధపగారిసా-రిగమరిగసాసరిసనిధ పా-మపధనిసానిరీసా- మొదలగునవి.

(vi) బేగడ రాగలక్షణము:—ఇది 29వ, మేళకర్త యగు ధీరశంకరాభరణ రాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:— స గ³ రి² గ³ మ¹ ప ధ²నీ²ధ²ప స.

అవరోహణము;—స నీ³ ధ² ప మా¹ గ³ రి² స.

భాషాంగరాగము. వక్రసంపూర్ణరాగము. షడ్జగ్రహము. రక్తిరాగము. సాయంకాలము 6 గంటల మొదలు 9 గంటల వరకు గానము సేయదగును. ఇందు మధ్యమ, నిషాదములు రాగఛాయాస్వరములుగా నున్నవి. ఈరాగమున 'గమాప, అను ఆరోహణ సంచారమునను ధపమా' అను అవరోహణసంచారముననుగల మధ్యమము కంపముతో నిలచు నపుడు శుద్ధమధ్యమ, ప్రతిమధ్యమములుగాక తనకోనయందు అల్పముగ పంచమస్వరమునుబట్టి క్రిందికి దిగును. సనీ³ధప అను ఈ సంచారమున కాకలీనిషాదము బలుకును. పధనీ²ధప, పనీ²ధపఅను సంచారములందు కైశికీనిషాదము బలుకును. అన్యస్వరమగుయీ

కైశిక్కనిషాద ప్రయోగమువలననేనిది భాషాంగమగుచున్నది. పై నిషాదములను కంపితము చేయునపుడు తనకానయందు అల్పముగ షడ్జమునుబట్టి క్రిందకి దిగును. ఇట్లుపలుకునపుడు కొన్నిచోట్ల కైశికియును కొన్నిచోట్ల కాకలియును కొన్ని చోట్ల రెండునుగాకనుబలుకును. గనుక పైజెప్పిన లక్షణమును బట్టి ఈ బేగడరాగమునకుగల సప్తస్వరములలో మధ్యమ, నిషాదములే మిగుల రంజనము గలిగించెడి జీవ స్వరములుగా నున్నవని తెలియదగును.

ఇందలి ముఖ్యసంచారములు:-

గమపధనీ²ధపాప - మధపమాప - గమపమ-గమగమారి-

గమపధనీ²ధపసాసా-సరిసీధపా-ధపసాసా-సగరిగా - గరిగమగ

మరీపమరీసా-సనిధనిసా-రినీధపా-పధనీ²ధపా-మపధమాగరి-గ

మపధపనీ²ధపమాగరిసా-ససిధపసా-నిరీసా. మొదలగునవి.

N.B:- ఈక్రింది 8వ ప్రశ్నలో సహాన, లేక శంకరాభరణరాగములో నేదైన నొక పాటయొక్క పల్లవ, అను పల్లవులమాత్రము కర్నాటకపద్ధతిలోనికిమార్చి వ్రాయమనియుండుటచే నదేవిధముగ నీక్రింద వ్రాయబడినదని గ్రహింపదగును.

శ్రీ త్యాగరాజ విరచితము.

## 8. శంకరాభరణ రాగము - ఆదితాళము.

ప. స్వరరాగసుధా రసయుత భక్తే - స్వర్గాపవర్గమురా ఓ మనసా॥ (స్వర)

అ. పరమానందమనే కమలముపై - బకభేకములు చెలగేమి సుఖమా॥ (స్వర)

ప. ;* స రి గా ;; – గ మా రి గా । మా , , మ గా । రీ,గ మా – మ గ గ రి ॥
;* స్వర రా ;; – గ సు ధా . । ర స, యు త । భ, . . – క్తే . . . ॥

2 సని* స రి గా ;; – రి రిగమా మమా । గ మ ధ , –మగా । రీ,గమా గమగా రిగరీ ॥
. .* స్వర రా ;; – గ సు. . ధా . । ర . స . –యుత । భ,. . క్తే . , ... ॥

3 సని* స రి గామగ గామగరీ–గమామమా।మాపాధనిసా; ధపమాగా। రిగమపమా గమగా రిగరీ ॥
. .* స్వర రా . . . . . . –గసు ధా . । ర . స . . ; యు.త . । భ. ... క్తే . . ... ॥

1 సని* సాసగరీ రిమగా–గపమా మధపా పమగా గామగరీ।సా;;ధనిసరి।సనిపామ గమపమ మగగరి ॥
. .* స్వర్గా. . ప . . –వ . . ర్గ . . ము. . . . . . ;।రా;;ఓ. . . ।. . మ . న ... సా... ॥

2 రిససని * ,, । సా;; గరిసని । ధప–రిసనిధపమ–సనిధపమగ–పమ ॥
. . . . * ,, । రా;; ఓ . . . । . .–మ. . . . . –న. . . . . –సా. ॥

3 గరిసని* ,, | సా;; మగరిస | రిగమపధనిసరి-గమగరిసనిధప ||
....* ,, | రా;; ఓ ... | మ. ... ... -న ...సా... ||

4 పగరిని * ,, | సా;; సా |, సనిధా - మపమా గరి ||
.... * ,, | రా;; ఓ |, మ... - న . . సా. ||
సని*
..* (స్వర)

అ. ;* మ. - పమగా మాపా,ధాని | సా;;సా | నిసనీ - ధనిధా - పమ గమపమ ||
;* ప ర - మా. .; . నం,దమ | నే;; క | మ.. - ల . . - ము. పై... ||

2 పగగరి* గమపా పమగా: మాపా, ధాని | సా;;- ధనిసరి | గమగరి సనిధప - పమగరి - గమపమ ||
..* ప. ర మా. .; . నం, దమ | నే;; - క... | మ ... ల ... - ము... - పై ... ||

గమాగ* మధపా - పధమా - మపపమ - గా | మ-రిగమపా-ధనిసరి | సనిపాంమ గమపమ-మగగరి ||
...* బ . క - ఛై. క - ము ... - లు | . -చెల . గే-మి ... | . . సు. ఖ ... -మా... ||
రిససని*
....* (స్వర)

**9.** కర్నాటక సంగీతాభివృద్ధికై మిక్కిలి పాటు పడిన వాగ్గేయకారకులలో ఆనతాండవపురం గోపాల కృష్ణభారతి (1811-1881) అరుణాచల కవిరాయర్ (1711-1778) రామ్నాడు శ్రీనివాసఅయ్యంగారు మిగుల ప్రశంసనీయులుగానున్నారు.

(i) వీరిలో మొదటివారగు గోపాలకృష్ణభారతి పరమ శివభక్తుడగు నందనారు దివ్యచరిత్రమును నాటకరూపముగ వ్రాసి ప్రదర్శింపించెను. మరియు వీరు "అయర్ పాగై నయనార్ చరిత్రము" "తిరునీలకాంత నయనార్ చరిత్రము" "కరైకాల్ అమ్మయార్ చరిత్రము" మొదలగు సంగీతనాటకములుకూడ వ్రాసియుండిరి. వీరి కీర్తనములన్నియు శివపరముగాను భక్తియుతముగాను సరళశైలిగను భావయుక్తముగ నుండును. అరవభాషయందుగల కీర్తనలలోనివి మిక్కిలి ప్రసిద్ధముగా నున్నవి.

(ii) రెండవవారగు అరుణాచల కవిరాయర్ రామ నాటకమును కీర్తనములతో అరవమున రచించి బాగుగ ప్రచారముచేసిన మహనీయుడు. వీరికీర్తనములన్నియు మిక్కిలి భావయుక్తముగను రసవంతముగనుండి ఆకర్షనీయముగానుండును. ఈ కీర్తనములు రామాయణ కథాసంధర్భము నను సరించిన కీర్తనములగుచే ముఖ్యముగా ద్రావిడులనేగాక తదితరులచే సయితు మాకర్షింపబడు చున్నవి. ఇతడు శిర్గాజీ స్థలపురాణము, హనుమార్ పిళ్ళై తమిాజ్, అశోముఖి మొదలగు నాటకములనుకూడ రచించెను.

(iii) మూడవవారగు రామ్నాడు శ్రీనివాసఅయ్యాంగారు, (పూచిఅయ్యంగారు) వీరు రామ్నాడు రాజుసహాయమున పట్నం సుబ్రహ్మణ్యఅయ్యర్ గారివద్ద సంగీత లక్ష్యలక్షణముల నేర్చి వృద్ధికివచ్చి ఆస్థాన పండితుడై అనేక కృతులు, తాన వర్ణములు, జావళీలు, తిల్లానాలు రచించెను. వీరి కృతులు చౌక కాలముగను, భావయుక్తముగను చిట్టస్వరములతోను కూడి వారి స్వంత పేరుతో సంతకముచేసి యుండును.

ఇటుల పైముగ్గురు గాయకశిఖామణులెంతయు పాటుపడి రచియింపబడిన కీర్తనములు కృతులు, తానవర్ణములు, జావళీలు, తిల్లానాలు ప్రస్తుతకాలమున కర్నాటక సంగీత విద్యావిధానమునకెంతయో నుపయుక్తముగ నున్నందున వీరికృషి మిగుల ప్రశంసనీయమై యున్నది.



# Government Technical Examinations.

## November 1931.

## Indian Music (Theory)–Higher Grade.

### ప్రశ్నలు

1.(a) (1) ఎడుప్పు (ii) కాలము (iii) స్థాయి. వీనిలో రెండిటిని ఉదాహరణములతో వివరింపుము.

(b) ఒక పాటను స్వరపరచి వ్రాయునపుడు చుక్కలను జత గీటులను వుపయోగపరచుటయొక్క ప్రయోజనమును దెలుపుము.

2.(a) పాటలను ఏవిధముగ విభజించియున్నారు. ఏవైనా 3 భాగముల యొక్క విశేషములను దెలిపించుము.

(b) రాగ-ఆలాపన అనగా నేమి?

(c) క్రొత్తగా పాటనేర్చుకొనువారికి రాగఆలాపన చేయుటకు ముఖ్యముగా గమనింపవలసిన ఏయేవిషయముల ను చెప్పెదవు?

3.(a) తాళము యొక్క "జాతి" అనగానేమి?

(b) "మ" అను స్వరము మేళకర్తరాగము లన్నింటిని రెండు సమభాగములుగా విభజించుచున్నది. అనగా నేమి అర్థము?

4. (a) శ్రీ త్యాగరాజస్వామియొక్క చరిత్రమును సంక్షేపముగా వ్రాయుము. కర్నాటక సంగీతముయొక్క గౌరవమునకుగాను ఆయనచేసిన కార్యములుఏమి?

(b) ముద్దుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రి, గోపాలకృష్ణభారతి వీరిలో ప్రతిఒకరును వ్రాసిన ఏవైన రెండు కృతుల పేర్లును, వానియొక్క రాగతాళములను వరుసగా వ్రాయుము.

5. ధన్యాసి, కేదారగౌళ, బేగడ, పూర్వకల్యాణి, శంకరాభరణము. వీనిలో 3రాగములయొక్క లక్షణములను వ్రాయుము.

6. నీలాంబరి, భైరవి, సారంగ, సహాన, ముఖారి, కామవర్ధని, బిలహరి. వీనిలో యేయే రాగములలో క్రమముగా ఈక్రింది స్వరములు వచ్చుచున్నవి.

(i) శుద్ధ ఋషభము. (ii) సాధారణ గాంధారము. (iii) ప్రతిమధ్యమము. (iv) కాకలీ నిషాదము.

7. (a) వాద్యములు ఎన్నివిధములు? ఎట్లువిభజింపబడుచున్నవి? ప్రతి భాగమునకును ఉదాహరణము వ్రాయుము.

(b) గోటు వాద్యమును, వీణ వాద్యమును చూచుటకు ఏమి వ్యత్యాసము తెలియుచున్నది?

8. కల్యాణి, హంసధ్వని, శంకరాభరణము. వీనిలో ఏదైన ఒక రాగములో మీరు పాడుచున్న కృతిని స్వరపరచి వ్రాయుము. దానియొక్క కర్త పేరును ఆకృతయొక్క తాత్పర్యమును దెలుపుము.

---

## జవాబులు

---

**1.** (a) ఎడుప్పు;— అనగా సంగీత రచనలో సంగీతమును తాళమునందు ప్రారంభించు తావునకు "ఎడుప్పు" అని చెప్పబడును. ఈ ఎడుప్పు మూడు విధములుగా నుండును. (i) సమఎడుప్పు (ii) అనాగతఎడుప్పు (iii) అతీతఎడుప్పు అనునవి. ఎడుప్పు అనునది ద్రావిడపదము. ఈ ఎడుప్పునే తెలుగున "ఎత్తుట" సంస్కృతమున "గ్రహము" అని చెప్పబడును.

(i) సమ ఎడుప్పు:— అనగా ఒక కీర్తన లేక పాటలోని పల్లవినిగాని మరి యే యితర భాగమునుగాని తాళమునందు మొదటి దెబ్బమీద (అనగా తాళము సంగీతము ఒకే సారి) ప్రారంభించిన అట్టి ఎడుప్పును "సమఎడుప్పు" అని చెప్పబడును. ఉదా:—

తాళము

భైరవిరాగము-ఆదితాళము — పాట

X సమ ఎడుప్పు

ప॥* సీ ; ధాధాపాపా-మాపా|గమాగ-మాధా|పా;పమపధ॥

* శ్రీ; ర ఘు వ ర-సు గు|ణా . . - . ల |య; రా..మ॥

(*పై కృతి సమఎడుప్పుగలది.

(ii) అనాగత ఎడుప్పు:— అనగా యేదైనఒక పాటలోని పల్లవినిగాని మరి యేయితర భాగమునుగాని తాళము ప్రారంభించిన తరువాత (అనగా మొదటిదెబ్బ తరువాత) సం

గీతమును మొదలిడిన అట్టి ఎడుప్పును "అనాగత ఎడుప్పు" అని చెప్పబడును. ఉదా:—

తాళము

పాట

కదనకుతూహలము రాగము-ఆదితాళము X అనాగత ఎడుప్పు

ప॥;;;* సారీమా; మా-। మ గ రీ ; సరి । సా-సనిధాపా ॥

;;;* రఘువం; శ -। సు • ధాం; బు• । ధి-చం • • ద్ర ॥

(*పై కృతి అనాగత ఎడుప్పుగలది)

(iii) అతీతఎడుప్పు:—అనగా యేదైన ఒక పాటలోని పల్లవి లేక యేయితర భాగమునైనను తాళాంత్యమందుగాని లేక తాళము ప్రారంభింపకముందుగాని సంగీతము మొదలిడిన అట్టి ఎడుప్పును "అతీత ఎడుప్పు" అని చెప్పబడును.

ఉదా:—

తాళము

పాట

సింధుమందారిరాగము-ఆదితాళము X అతీత ఎడుప్పు

*పా॥

*క॥

ప॥ సా నీ; ధాపాగా;మా । ధాపా;మా । రిగమా ;; ॥

రుణిం; చు టకి; దే । స మ;య । మా•య్యా ;; ॥

(*పై కృతి అతీత ఎడుప్పుకలది)

పైనివేయబడిన గురుతుల వివరము:—

తాళమును సూచించునది

పాటను సూచించునది

పాటను ప్రారంభించుతావును సూచించునది. X

కాలము:— అనగా సంగీతము పాడునపుడు అ వేగమును సూచించునది కాలమనబడును.

ఇది ముఖ్యముగా 3 విధములు. అవి యేవనగ ద్వితీయ, తృతీయ లేక విళంబ, మధ్య, ద్రుతకాలవ ఈమూటినికలిపి చెప్పునపుడు త్రికాలమనిచెప్పబడు దానికొకటి రెట్టింపు వేగము గలిగియుండును. అనగా ప్ర మునందుగల ఒక్కొక్క అక్షరకాలములో, ద్వితీయకా డుఅక్షరములవంతునను, తృతీయకాలమున నాలుగు వంతునను నడుపవలెను. ఈ త్రికాలముల ఉదాహర క్రిందను దెలుపబడుట గమనించునది.

ఉదాహరణము:— సరిగమపధనిస-సనిధపమ
మాయామాళవగౌళరాగము - ఆదితాళవ

| కాలములు. | 1 | | | | 0 | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్రథమ, లేక విళంబ కాలము. | స<br>స | రి<br>ని | గ<br>ధ | మ<br>ప | ప<br>మ | ధ<br>గ | |
| ద్వితీయ, లేక మధ్య కాలము. | సరి | గమ | పధ | నిస | సని | ధప | మ |
| తృతీయ, లేక ద్రుత కాలము. | సరిగమ<br>సనిధప | పధనిస<br>మగరిస | | | సరిగమ<br>పధనిస | | |

పై మూడు కాలములుగాక 4, 5, 6 కాలములుగూడ గలవు. ఇవియును ఒకదానికొకటి రెట్టింపు వేగము గలిగి యుండును. ఈ ఆరు కాలములను కలిపి చెప్పునప్పుడు షట్కాలములని చెప్పుదురు. ఇవి సాధారణముగా వాడుకయందు దరుదుగానుండుటచే వాని ఉదాహరణముల నిందుజూపలేదు.

(b) ఒక పాటను స్వరపరచి వ్రాయుటలో చుక్కల నుపయోగపరచుటయొక్క ప్రయోజన మేమనగా?

(i) ఏదైన ఒకపాటను స్వరపరచి వ్రాయునప్పుడు ఆ పాటయొక్క సంగతుల హెచ్చుతగ్గునుబట్టి ఆయాస్వరములు మంద్ర, మధ్య, తారస్థాయిలందుండుటసహజమైయున్నది. గనుక అట్టి త్రిస్థాయిలందు వ్రాయబడు స్వరములలో యేస్వరము యేస్థాయియందు పాడదగునో పాఠకులు వెంటనే గుర్తింపగలుగుటకు సంకేతముగ చుక్కలను స్వరముల క్రిందను, స్వరముల మీదను వుపయోగింతురు. వీనియొక్క ప్రయోజన మేమనగా, యేదైన నొకస్వరముక్రింద చుక్క (.) గురుతువేయబడిన యట్టిస్వరము మంద్రస్థాయి స్వరమనియు, స్వరమునకు మీదచుక్క (.) గురుతువేయబడిన యట్టిస్వరము తారస్థాయి స్వరమనియు, స్వరమునకు క్రిందను మీదను చుక్క (.) గురుతు వేయకుండిన యట్టిస్వరము మధ్యసాయి స్వరమనియు అభ్యాసకులు గ్రహించి పాటలందుగల స్వరసాహిత్యములను పాడగలుగుటకు చుక్క గురుతులుమిక్కిలి ప్రయోజనముగా నుండును.

(ii) ఒకపాటను స్వరపరచి వ్రాయుటలో జతగీట్లు నుపయోగపరచుటయొక్క ప్రయోజన మేమనగా?

ఏదైన నొకపాటను స్వరపరచి తాళాంగములతో వ్రాయునపుడు అందలి స్వరసాహిత్యములు వానికి యేర్పరచి యున్న అంగములతో తాళమునందొకసారి పూర్తియగు తావు (ఆవర్తాంత్యము)ను దెలుపుటకు . సంకేతముగా జత నిలువుగీట్ల నుపయోగింతురు. ఇట్టి జత నిలువుగీట్ల నుపయోగించుటవలన పాఠకులు పాటలను తాళమునందు ఆవర్తములుగా విభజించి పాడుటకును, పాటయొక్క పరిమితిని ఆవర్తములద్వారా లెక్కించుటకును యీ జత నిలువుగీట్లు మిక్కిలి ప్రయోజనమగుచున్నవి.

**2.**(a) పాటలనుముఖ్యముగా 3విధములుగా విభజించి యున్నారు. ఆ 3భాగములు ఏవనగా. (1) పల్లవి (2) అనుపల్లవి. (3) చరణము లనునవి. వీనియొక్క విశేషమేమనగా పల్లవి ననుసరించి అనుపల్లవియును, అనుపల్లవి ననుసరించి చరణమును యుండి పల్లవియొక్క అభిప్రాయము అనుపల్లవిలో కొంతవరకును చరణములో విశదముగానుండి యుండును. సాధారణముగా పల్లవి ఒక ఆవర్తముగానుండిన అనుపల్లవి రెండు ఆవర్తములుగను, చరణమునాల్గు ఆవర్తములుగాను, పల్లవి రెండు ఆవర్తములుగా నుండిన మిగత అనుపల్లవ చరణములు రెట్టింపు ఆవర్తములుగానుండి పల్లవి ప్రోత్సాహముగ నుండుటయేవీనియొక్కవిశేషమునుసంప్రదాయమునై యున్నది.

(b) రాగఆలాపన మనగా? విశిష్టమైన రాగలక్షణ విశేషణములననుసరించి నియమితమైన స్వరసమ్మేళనముతో రాగమును విస్తరించుట. అనగా మనుష్యాది జీవకోట్లు వృద్ధిజెం

దుటకు ఆహారమెటుల అత్యావశ్యకమగునో యటులనే రాగ ముఅభివృద్ధిజెందుటకు ఆలాపన మత్యంతావశ్యకమైయున్నది. గనుక ఏదైనఒకరాగమును ఆలాపనజేయుటకుముందు అది జనకరాగమూలేక జన్యరాగమా?యని తెలిసికొనిఆరాగముయొక్కఆరోహణ అవరోహణాస్వరములను వానిభేదములను జీవస్వర,న్యాసస్వర, అన్యస్వర ప్రయోగములాదిగాగలరాగలక్షణము లననుసరించి వివిధములగు సంగతులయొక్క మార్పులతో రాగమును విస్తరించి రాగాలాపన లక్షణమునందు జెప్పబడిన, 1-2-3-4 రాగవర్ధనులకేర్పరచిన సిర్ణీతకాలములందు సర్వజన మనోరంజకమగు నటుల మంద్ర, మధ్య, తారస్థాయిలందు పునరోక్తి లేకుండ సంచారముజేసి ఆధారశ్రుతియగు మధ్యషడ్జమును జేరుట రాగాలాపన మనబడును.

(c) క్రొత్తగాపాటనేర్చుకొనువారికి రాగాలాపనచేయుటకు ముఖ్యముగా గమనింపజేయవలసిన విషయములేవనగా:

(1) ఆలాపనచేయబడు రాగము జనకరాగమా? జన్యరాగమా?

(2) జనకరాగమైన శుద్ధమధ్యమరాగమా? లేక ప్రతిమధ్యమరాగమా? వానిపేరు, వాని సంఖ్య, వాని స్వరముల వివరము.

(3) జన్యరాగమైన వాని జనకరాగము, సంఖ్య, స్వరముల వివరము.

(4) జన్యరాగమైన ఔడవమా? షాడవమా? సంపూర్ణమా? వక్రమా? వాని భేదములా?

(5) జన్యరాగమైన ఉపాంగమా? భాషాంగమా? భాషాంగమైన అన్యస్వర వివరములేమి?

(6) జన్యరాగమైన పంచమాంత్యరాగమా? ధైవతాంత్యరాగమా? నిషాదాంత్యరాగమా?

(7) ఘనరాగమా, రక్తి(నయ)రాగమా, దేశీయరాగమా?

(8) జంటస్వర, దాటుస్వర ప్రయోగముల వివరములేమి?

(9) రాగరసములలో యే రసమునకు సంబంధించిన రాగము?

(10) ఏ సమయమున పాడదగిన రాగము?

మొదలగు ముఖ్య విషయములను గ్రహింప గలుగునటుల చేసిన పిదప ఆరాగమునకుగల జీవస్వర, న్యాసస్వర, వివరములు, గమకవరీకులు, వర్జస్వరములాదిగాగల తదితర ప్రయోగములన్నిటి వివరములను క్రొత్తగా నేర్చుకొనువారికి రాగాలాపనయందు ముఖ్యముగా బోధింపవలెను.

**3.** (a) తాళముయొక్క "జాతి" అనగా తాళాంగములగు అనుద్రుత, ద్రుత, లఘు, గురు, ప్లుత, కాక పాదములలో ప్రాముఖ్యమైన లఘువును వేయునపుడు దానియొక్క అక్షరకాలమును జాతినిబట్టియే నిర్ణయింపవలసి యున్నందున లఘుసంబంధమైన యీజాతి తాళమునకెంతయు ప్రాముఖ్యమై యున్నది. ఈజాతులు 5 విధములు. (1) త్రిశ్రజాతి (2) చతురశ్రజాతి (3) ఖండజాతి (4) మిశ్రజాతి (5) సంకీర్ణజాతి. ఇవి వరుసగా 3,4,5,7,9 అక్షరములను కలిగియుండును- ధృవాది

సప్త తాళములు యీ పంచజాతుల సంయోగమువలననే 7×5=35 తాళములగుచున్నవి. గనుక పైవిధమున యీ 35 తాళములును పంచజాతులలో నొకజాతికి చెందియేయుండునుగాని జాతిరహితముగ నేతాళముండనేరదు. పైలె౫ తాళములలో నేతాళమైనను వేయునప్పుడు ఆ తాళమునకేర్పరచియున్న అంగములను దెలిసికొనియున్నను ఆతాళముయొక్క జాతిని గనుగొననియెడల అట్టి తాళమునకుగల లఘువులను వేయుటకెవ్వరికిని సాధ్యముగానేరదు.గనుక తాళదశప్రాణములలో నీ జాతి మిక్కిలిముఖ్యమనిచెప్పదగియున్నది. ఇదే తాళముయొక్క జాతి అనుమాటకర్ధము.

(b) "మ" అనుస్వరము మేళకర్తలను రెండుసమభాగములుగ విభజించుచున్నదనుట కర్ధమేమనగా?

వెంకటమఖివారి మేళకర్తరాగ పద్ధతిలోచెప్పబడినటుల సప్తస్వరములలోని"సరిగమ"అను పూర్వాంగముయొక్క శుద్ధ వికృతి స్వరభేదములలో మొదటిశుద్ధస్వరభేదములచేత"పధని" అను ఉత్తరాంగ స్వరములయొక్క శుద్ధ వికృతిభేదములను వరుసగా ప్రస్తరించితే 6మేళములు యేర్పడును. అదేవిధముగా పూర్వాంగముయొక్క శుద్ధవికృతి భేదములలో నొక్కొక్క స్వరభేదముచే ఉత్తరాంగ శుద్ధవికృతి స్వరములను వరుసగా ప్రస్తరించుచు వచ్చిన రెండవ భేదముచేత 6 మేళములును, మూడవ భేదముచేత 6 మేళములును, నాల్గవభేదముచేత 6 మేళములును, అయిదవ భేదముచేత 6 మేళములును, ఆరవభేదముచేత 6 మేళములును ఏర్పడుటచే మొత్తము 6×6=36 మేళ

ములును శుద్ధమధ్యమ ప్రస్తారముచేతనే యేర్పడుచున్నవి. వీని నే తిరిగి మధ్యమముయొక్క వికృతిభేదమగు ప్రతిమధ్యమ స్వరముచే ప్రస్తరించిన మరియొక 36 మేళములు యేర్పడి మొత్తం 36+36=72 మేళకర్త రాగములు యేర్పడుచున్నవి. వీనినే జనకరాగములనియు, మేళరాగములనియు, కర్త రాగములనియు, సంపూర్ణ రాగములనియు, "వేరు" రాగములనియు;మూలరాగములనియు,ముఖ్యరాగములనియుచెప్పబడును. ఇటుల మేళకర్తలు 36 నుండి 72గా నేర్పడుటకుమధ్యమము యొక్క శుద్ధవికృతిభేదములప్రస్తారమే కారణమగుచున్నందున, శుద్ధవికృతి స్వరభేదములుగల యీ మధ్యమము అనగా "మ" అను స్వరము 72 మేళకర్తలను రెండు సమభాగములుగా విభజించుచున్నదను మాటకర్థము యేర్పడుచున్నది.

## శ్రీ త్యాగరాజ చరిత్రము.

**4.** (a) సంగీత త్రిమూర్తులలో నగ్రగణ్యుడును కవిశేఖరుడును, గాయక సార్వభౌముడునగు శ్రీ త్యాగరాజుగారు తంజావూరు జిల్లాలోని "తిరువారూరు" అను గ్రామమున 1759వ, సంవత్సరములో జన్మించెను. వీరిపూర్వీకులు తెలుగుదేశమునుండి దక్షిణదేశమునకువలసపోయిరి. ఇతడుమురికినాడు త్రిలింగవైదీకి. భరద్వాజ గోత్రీయుడు. తెలుగుబ్రాహ్మణుడు. వీరితండ్రిపేరు రామబ్రహ్మము. తల్లిపేరు శాంతమ్మ, తండ్రితండ్రిపేరు గిరిరాజకవి. భార్యపేరుపార్వతి. మహాపతివ్రత. భక్తురాలు. ఆమె ముత్తైదువుగనే స్వర్గస్తురాలయ్యెను. కుమార్తె పేరు సీతామహాలక్ష్మి. సంగీతగురువుపేరు శొంఠి వెంకటరమణయ్య.



శ్రీ త్యాగరాజు (1759—1847)

లలో రామాయణము రచించియుండిరనియు చెప్పుదురు. వీరి శిష్యులలో ముఖ్యులు (1) వీణ కుప్పయ్యర్ (2) మనంబు చావడి వెంకట సుబ్బయ్యర్ (3) వాలాజబాద్ వెంకటరమణ భాగవతార్ (4) అయ్యా భాగవతార్ (5) ఉమయాల్పురం కృష్ణభాగవతార్ (6) సుందర భాగవతార్ (7) మధ్యార్జునం గోవిందశివన్ (8) సభాపతి అయ్యర్ (9) రామయ్యాంగారు (10) నెయ్కర్కరపట్టి సుబ్బయ్యర్ (11) గణేశయ్య (12) తంజావూరు రామరావు (13) నంగవరమ్ నీలకాంతయ్యర్, (14) సుబ్బరామ భాగవతార్ (15) అమృతలింగం పిళ్ళె మొదలగువారు. ఇదే సంక్షేపమైన వీరి చరిత్రాంశము.

త్యాగయ్యగారు కర్నాటక సంగీతమునకెంతయు ప్రాముఖ్యమైన కృతులు, కీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు, ఉత్సవ సంప్రదాయ కీర్తనలాదిగాగల వేలకొలదిరచనలను రాగభావ సంపత్తితోను భక్తిరసపూరితముగను మృదుమధుర శైలిలో రచించి- శిష్యపరంపరలచే ప్రపంచమున వెదజల్లి కీర్తిని గడించిన సంగీతోద్ధారకులగుటచే కర్నాటక సంగీతముయొక్క గౌరవమునకుగాను వీరుచేసిన రచనారూపకమైనకృషి మిగుల ఘనకార్యమును చిరస్థాయియైయున్నది.

(b) ఈక్రింది ముగ్గురువాగ్గేయకారకులు ఆయాకృతులను ఆయా రాగతాళములలో రచించినటుల దెలియదగును.

| రచయితలు. | కృతులు. | రాగములు. | తాళములు. |
| --- | --- | --- | --- |
| 1 ముద్దుస్వామిదీక్షితులు | మీనాక్షి మేముదం | పూర్వకల్యాణి | చ. త్రిపుట |
| | నీలకంఠం భజేహం | కేదారగౌళ | చ. రూపకము |

| | | | |
|---|---|---|---|
| 2 శ్యామ శాస్త్రి | ఓజగదంబ | -ఆనంద భైరవి | -చ.త్రిపుట |
| | నిన్నువినాగామరి | -పూర్వీకల్యాణి | -మి.చాపు |
| 3 గోపాలకృష్ణభారతి | శివలోకనాథనై | -నాదనామక్రియ | -చ.రూపకము |
| | కనకసభాపతి | -ధన్యాసి | -చ.త్రిపుట |

**5.** (i) ధన్యాసిరాగలక్షణము;—ఇది 8వ మేళకర్త యగు హనుమత్తోడి రాగమునందు జనించిన జన్యరాగము.

ఆరోహణము:— స గ$^{2}$ మ$^{1}$ ప ని$^{2}$ స

అవరోహణము:— స ని$^{2}$ ధ$^{1}$ ప మ$^{1}$ గ$^{2}$ రి$^{1}$ స.

ఉపాంగరాగము. ఔడవసంపూర్ణము. షడ్జగ్రహము. రక్తిరాగము. ఆరోహణమున, రిషభ, ధైవతములు, వర్జ్యము. అవరోహణము సంపూర్ణము. ఈరాగమునకు సాధారణ గాంధార, కైశికీ నిషాదములు మిగుల రంజనము గలిగించు జీవస్వర, న్యాసస్వరములుగా నున్నవి. రాత్రి 3 గంటలు మొదలు ఉదయం 6 గంటలవరకు గానము సేయదగును. గగమమపపనిని, మొదలగు జంటస్వరప్రయోగములును రిరిని-ససప-ధధమ యిట్టిదాటుస్వరప్రయోగములును ఈరాగమునకుముఖ్యముగా నున్నవి. ఇందుగల ముఖ్య సంచారములు.

గమపనిసాసా-సనిధాపా-నిసమగారిసగరిస-సనిరిసనిధపా-మగమపనీధపా-పనిసానిధపమపా-ధపగారిస-సానిధపనీసా. మొదలగునవి.

(ii) కేదారగౌళరాగ లక్షణము:— ఇది 28వ మేళ కర్తయగు హరికాంభోజిరాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:— స రి$^2$ మ$^1$ ప ని$^2$ స.

అవరోహణము:— స ని$^2$ ధ$^2$ ప మ$^1$ గ$^3$ రి$^2$ స.

ఉపాంగరాగము. ఔడవ సంపూర్ణము. నిషాదగ్రహము. రక్తిరాగము. సాయంకాలము గానము సేయదగును. ఆరోహణమున గాంధార ధైవతములు వర్జ్యము. అవరోహణము సంపూర్ణము. ఈరాగమునకు రిషభ, గాంధార, మధ్యమ, నిషాదములు విశేష రంజనము గలిగించు రాగచ్ఛాయా స్వరములుగానున్నవి. ఇందు రిషభము న్యాస స్వరముగానుండి, కొన్ని చోటుల నిషాదము ఎడుపు స్వరముగానున్నది. ఇది మిక్కిలి ప్రసిద్ధరాగములలోనొకటియై యున్నది.

ఇందుగల ముఖ్య సంచారములు:—

రిమపనీసాసా-సనిరిసనిధపా-మపనిసరిమా•గరీ-మగగరిసా-పనిసా

రిసనిధపా-మపనిధధపమా•గరీ-రిపమగరిగారిసా-నిసరీగరిసా-నిధపమపనీసా-నిరీసా- మొదలగునవి.

(iii) శంకరాభరణ రాగలక్షణము:— ఇది 29వ మేళకర్తరాగమై కటపయాదివిధికిసరిపడుటకు "ధీర" అనుపదము ఈరాగమునకు ముందు జేర్పబడినదిగానున్నను కొన్నిప్రయోగ

ములవలన నిది ధీరశంకరాభరణరాగమున జనించిన జన్యరాగ మనియే పరిగణింపబడుచున్నది.

ఆరోహణము:— స రి$^{2}$ గ$^{3}$ మ$^{1}$ ప ధ$^{2}$ ని$^{3}$ స.

అవరోహణము:— స ని$^{3}$ ధ$^{2}$ ప మ$^{1}$ గ$^{3}$ రి$^{2}$ స.

సంపూర్ణరాగము. షడ్జగ్రహము. సర్వస్వర గమక వరీక రాగము. రక్తిరాగము. సాయంకాలము పాడదగిన రాగమని యే పూర్వాచార్యుల యభిమతమైనను అన్ని కాలములందు పాడ దగిన రాగమనియే ప్రస్తుత కాలమున వాడుచున్నారు. ఈ రాగమునందుగల అన్ని స్వరములు రాగచ్ఛాయా స్వరములు గానున్నవి. ఈరాగమున సస,రిరి,గగ,మమ,పప మొదలగు జంటస్వర ప్రయోగములును రిని,సధ,నిప,ధమ, పగ,మరి,గసా మొదలగు దాటుస్వరప్రయోగములును ముఖ్యముగా నున్నవి- ఇది పెద్దరాగములలో నొకటిగానున్నది. మరియు నీరాగమున సధపలను నిషాదవర్జప్రయోగములు అవరోహణమున సాధార ణముగా వచ్చుచున్నను, సనిధపలనెడి ప్రయోగము లేతరచుగా నిందు వచ్చుచుండుటచే కొందరు దలచునటుల అవరోహణము షాడవముగాక సంపూర్ణమనియే చెప్పబడుచున్నది.

ఇందుగల ముఖ్య సంచారములు:—

మగమపధానిసా సా-ససనిధనిపధానిసా-సనిధపా-మపధనిసరిగా-

రిగమగరిగరిసా-సనిసగరీసని-సనిపధనిసా-రినిధపా-ధమగరిసా-సాసధపమపా-పమగరిగమధా-మారీగమగరిసా సరిగమపామ గరీసా-పాసా నీరీ-సనిసమగరిసా-నిధనిపధానిసా- మొదలగునవి.

**6.** రాగములు. స్వరములు.

(1) నీలాంబరి,లో ... కాకలీనిషాదము.

(2) భైరవి,లో ... సాధారణగాంధారము.

(3) సారంగ,లో ... ప్రతిమధ్యమము, కాకలీనిషాదము

(4) సహాన,లో ... సాధారణగాంధారము.

(5) ముఖారి,లో ... సాధారణగాంధారము.

(6) కామవర్ధని,లో... శుద్ధరిషభము, ప్రతిమధ్యమము, కాకలీ నిషాదము.

(7) బిలహరి,లో ... కాకలీ నిషాదము.

పై గనుబఱచిన విధమున ఆయారాగములందు క్రమముగా ఆయా స్వరములు వచ్చునని దెలియదగును.

**7.** (a) వాద్యములు తంత్రీవాద్యములనియు (వీణ మొ.) గాలివాద్యములనియు (వేణు మొ.) చర్మవాద్యములనియు(మృదంగము మొ.) త్రివిధములుగానున్నను అవి వాని వాని ఉపయోగములననుసరించి 3 విధములుగా విభజింపబడుచున్నవి. అవి ఏవనగా: (i) శృతివాద్యములు (ii) లయ వా

ద్యములు (iii) సంగీత వాద్యములు. వీని ఉపయోగములు ఉదాహరణము లేవనగా?

(i) శృతివాద్యములు:—అనగా ఈ రకమునకు చెందినవాద్యములు గాత్రమునగాని జంత్రమునగాని గానమొనర్పునప్పుడు శృతికిమాత్రమే ఉపయోగింపబడును. ఉ:—తంబుర, ఏక్తార్- తుంతిన, ఒత్తు, (ottu) మొదలగునవి.

(ii) లయవాద్యములు:—అనగా ఈరకమునకు జెందిన వాద్యములు, గాత్ర, జంత్రగానములందు లయ (తాళ) సంబంధమైన ప్రక్క వాద్యములుగా నుపయోగింపబడును. ఉ:—మృదంగము. ఘటం, కంజీర, డోలు, డోలక్, గెత్తువాద్యం, మోర్సింగ్, తబల, జాల్ర, చిప్లా, సిలంబు, మొ.

(iii) సంగీత వాద్యములు:—అనగా ఈరకమైన వాద్యములు సంగీతమును నోటితో పాడకుండనే కచ్చేరీచేయుటకర్హమైనవిగానుండును. ఉ:—వీణ, ఫిడేలు (violin), వేణు (flute), నాగస్వరమ్, గోటువాద్యము, జలతరంగము మొదలగునవి.

(b) గోటువాద్యము, వీణావాద్యము చూచుటకు విశ్లేష భేదము లేక ఒకేవిధముగా నుండును. అయితే వీణావాద్యమునందు స్వరస్థానములను మెట్లతో సమర్పబడి యుండును. గోటువాద్యమునందు స్వరస్థానములను మెట్లతో సమర్పబడి యుండక తంబురవలె కేవలము తంత్రులనుమాత్రము గలిగి యుండును. ఇదియొకటే పై రెండు వాద్యములను చూచుటలో గలముఖ్యవ్యత్యాసము.

## 8. హంసధ్వనిరాగము-ఆదితాళము.

ప. శ్రీరఘుకులమందుబుట్టి నీవు-సీతను చేకొనిన రామచంద్ర ॥ (శ్రీరఘు)

అ. ఆరామమందు మునులకోరిక-లీడేరసేయబూనుకొన్న రామ॥ (శ్రీరఘు)

చ. వరరత్నపీఠమందు మజ్జనము-పుడమి సురులచే గైకొన్న రామ॥
పరమభక్తులను పాలనంబుసేయు-సాకేతవాస త్యాగరాజనుత॥ (శ్రీరఘు)

తాత్పర్యము:- శ్రీ రఘువంశమున బుట్టినవాడవై సీతను వివాహమాడిన యోరామచంద్రా, మునులకోర్కెలు ఫలింపజేయుటకై పూనుకొని వనమున విహరించిన రామా, శ్రేష్టమగు రత్నసింహాసనమున బ్రాహ్మణులచే బట్టాభిషేకము నొందిన రామా, భక్తాగ్రేసరులను రక్షించునట్టి అయోధ్యానివాసుడవైన రామా! అని త్యాగయ్యగారు శ్రీ రామచంద్రుని అనేక విధముల కొనియాడుచున్నారు.

ప. ;;;* ప నిసాసనిపాగా । రీ,సా, – సని । పని – సరిగారీ॥
;;;* శ్రీ. . ర . . ఘు । కు,ల, – మం । దు. – బు. . ట్టి॥

2 గా,గా,* ప నిసరిసనిపాగా । రీ,సా,– సని । పని – సరిగారీ॥
నీ, వు,* శ్రీ... ర. . ఘు । కు,ల, –మం. । దు. – బు. .ట్టి॥

3 గా,గా,* ప నిసరిగరిసనిపగ । రీ,సా,–సని । పని – సరిగారీ॥
నీ, వు,* శ్రీ... ర...ఘు. । కు,ల, –మం. । దు. – బు. .ట్టి॥

1 గా,గా,* గాపాపాసా నీ । సా;; – స రి । సని – పా;సని॥
నీ,వు,* సీ . త . ను । చే ;; – కొని । న . _ రా;మ.॥

2 పా,గారి* గపగప పాసానీ । పనిసరిగా–గ రి । సా –సరిసనిపా॥
చం,ద్ర.* సీ... త . ను । చే... . –కొని । న –రా...మ॥

3సనిపగరిగ* గపగప పాసానీ । పనిసరిగప–గ రి। సా –సరిసనిపా॥
చం. .ద్ర.* సీ... త . ను । చే..... –కొని। న –రా...మ ॥

సనిపగరిగ*
చం. ద్ర.* (శ్రీరఘు)

అ. ;;;* సనిపా–పనిసారీ । గా, రీ, –గగ। రీ – సరిగారీ ||
;;;* అ.. –రా. .మ । మం,దు, –ముసు। ల –కో. . ర ||

2. రీ ;;* సనిపగ–ప నిసారీ । గా, రీ, –గ గ। రీ –స రిగపగా ||
క ;;* అ... –రా. . మ । మం,దు, –మును। ల –కో ... ర ||

రీ ;;* సనిగరి–సనిపాగా । పనిసా; –స రి । స ని–పనిసంగరి ||
క ;;* లీ.. .–డే. . ర । సే.య; –బూ. । ను . కో...న్న.||
సనిపగరిగ*
రా ...మ.* (శ్రీరఘు)
చ. ;;;* గాగాగా; రీ – । గా పా –ప ని । స ని పా; గా ||
;;;* వ ర ర ;త్న – । పీ, ఠ,–మం. । దు . మ; జ్జ ||

2 గా,రీ,* గాగాగా; రీ – । గపనీ ; – స రి। స ని పా; గా ||
న,ము,* వ ర ర ;త్న । పీ. ఠ ; – మం.। దు. మ; జ్జ ||
గా,రీ,* స రి గ ప–గారీసా। సనిపా; – ప ని। సా–స రిగారి గ||

న,ము,* పుడమి .–సురు ల। చే. . ; – గై. । . –కో. . న్న.||

పా,పా,* సనిపా – పనిసా రీ। గా, రీ, – గా । రీ – సరిగా రీ ||
రా, మ,* పర మ – భ. . క్తు। ల, ను, – పా । ల –నం. . బు ||

రీ,రీ,* సనిపగ–పని సారి । గా, రీ, – గా । రీ – సరి గపగా||
సే,య,* పరమ.–భ. . క్తు । ల, ను, – పా । ల – నం . .బు ||

రీ, రీ, * సనిగరి–సనిపాగా । పనిసా; – స రి। సని– ప నిసరిగరి||
సే,య,* సా. ..–కే. . త । వా. స; –త్యా.। గ.– రా ... జ.||

సనిపగరిగ*
ను... త.* (శ్రీరఘు) కృతికర్త త్యాగయ్య.

# Government Technical Examinations.

## November 1932. 2/237/9736

## Indian Music (Theory)–Higher Grade.

12/237/9736

### ప్రశ్నలు.

1. (a) మూడవదియైన అగ్నిచక్రములోని (6) ఆరు మేళకర్తరాగముల స్వరములను పేర్కొనుము.

(b) ఈ క్రింద వ్రాయబడిన మేళకర్తరాగముల సంఖ్యలను క్రమముగా తెలియజేయునది.
(i) వరుణప్రియ, (ii) నాగానందిని, (iii) హేమవతి.

(c) కటపయాదిచక్రప్రయోగమును విశదముగా వ్రాయునది.

2. (a) ఆరోహణ, అవరోహణములలో సప్తస్వరములువచ్చునట్టి కొన్ని జన్యరాగముల నుదహరించి, అట్లుదహరింపబడిన జన్యరాగములకున్ను వాని జనకరాగములకున్ను గలభేదము యెట్లుకలుగునను విషయములను విశదముగా వ్రాయునది.

(b) ఈ క్రిందకనుపరచియుండు రాగములయందు వచ్చు అన్యస్వరములెవ్వి? అట్టి అన్యస్వరములు ఏ సంచార

ములయందు ప్రయోగింపబడుచున్నవి.

(i) కాంభోజి (ii) బిలహరి (iii) సారంగ.

3. ఈ క్రిందవ్రాయబడియుండు రాగములలో యేరెంటి కైనను లక్షణము వ్రాయునది.

(i) తోడి (ii) ముఖారి (iii)సహానా(iv) హంసధ్వని.

4. (a) (35) ముప్పదియైదు తాళములలో ఆవర్తము ఒకటికి (11) పదునొకండు అక్షరకాలములు వచ్చునట్టి మూడు తాళములను తెలియజేయుడు.

(b) రాగమాలికయొక్క లక్షణమును వ్రాయుము.

5. (a) త్యాగరాజులవారికి పూర్వముండిన ముఖ్యవాగ్గేయకారకుల పేర్లను వ్రాయుడు. వారిచే కర్నాటకసంగీత మెట్లుఅభివృద్ధిచెందినదనుట సంక్షేపముగావ్రాయునది.

(b) త్యాగరాజులు లేక ముద్దుస్వామిదీక్షితుల వారిచే రచింపబడిన కృతులలో శ్రేష్ఠమైనట్టి కృతులందొక్కదానికింగల విశేషమును వ్రాయుము.

6. ఈ క్రిందివాటిని గురించి సంక్షేపముగా వ్రాయుము.

(i) దేశీయరాగము, (ii) పదము, (iii) సంగతి, (iv) మనోధర్మసంగీతము.

7. (a) తంత్రీవాద్యముల విభాగములను వ్రాయుడు.

(b) వీణ, లేక, ఫిడేలు యొక్క భాగములను గూర్చిపటసహితముగా నొకచిన్నవ్యాసము వ్రాయుడు.

8.(a) ఈక్రిందిరాగములలో ఏదైననొకరాగములో మీరునే ర్చుకొనిన ఒకకృతినిస్వరసాహిత్య తాళాంగములతో వ్రాయుచు ఆపాటయొక్క తాత్పర్యమునువ్రాయుము.

(i) భైరవి (ii) మోహన (iii) శంకరాభరణము (iv) కల్యాణి.

(b) ఒకపట్టణమున త్యాగరాజులవారి ఉత్సవసమయమునఅనే కమంటపములయందు సంగీతకచ్చేరీలు జరుగుచుండెను. అట్టి సందర్భమున A, B. అనువారు మొదటిసంగీత మంటపమునకు వెళ్ళిరి. కొంతకాలమైన తరువాత A రెండవమంటపమునకును,Bమూడవమంటపమునకున్ను వెళ్ళిరి. A అనువానికి రెండవమంటపమునందుపాడు వారిశ్రృతి మొదటిమంటపమున పాడుచున్నవారిశ్రృతి కన్న ఒకపూర్ణస్వరము యెక్కువగా తోచెను. B అనునతనికి మూడవమంటపమందు పాడువారిశ్రృతి, మొదటిమంటపమున పాడువారిశ్రృతికన్న ఒకటిన్నరస్వరమధికముగాతోచెను. మొదటిమంటపమునపాడు విద్వాంసుల శ్రృతిపంచమముగా తలచినయెడల రెండుమూడు మంటపములయందు పాడు విద్వాంసుల శ్రృతులు యే స్వరములుగానుండును.

## జవాబులు.

**1.**(a) మేళచక్రములగు ఇందు, నేత్ర, అగ్ని, వేద, బాణ, ఋతు, ఋషి, వసు, బ్రహ్మ, దిశి, రుద్ర, ఆదిత్య అనెడి 12 చక్రములలో 3వదైన అగ్నిచక్రములోని 6 మేళకర్తరాగములు వాని స్వరము లేవనగా:—

| మేళకర్తలపేర్లు. | మేళకర్తసంఖ్యలు. | స్వరములవివరములు. |
|---|---|---|
| గాయకప్రియ | 13 | సరి$^1$గ$^3$మ$^1$పధ$^1$ని$^1$స. |
| వకుళాభరణము | 14 | ,, ,, ధ$^1$ని$^2$స. |
| మాయామాళవగౌళ | 15 | ,, ,, ధ$^1$ని$^3$స. |
| చక్రవాకము | 16 | ,, ,, ధ$^2$ని$^2$స. |
| సూర్యకాంతము | 17 | ,, ,, ధ$^2$ని$^3$స. |
| హాటకాంబరి | 18 | ,, ,, ధ$^3$ని$^3$స. |

పైజూపినవిధమున ఆరోహణమునందుగల స్వరములే అవరోహణముననుండును. ఆయా స్వరములకుగల సంఖ్యల ననుసరించి వాని పేర్లను యీ గ్రంథమున మొదటనుండు గురుతుల పట్టికవలన సులభముగా గ్రహింపదగును.

(b) వరుణప్రియ, నాగానందిని, హేమవతి. ఈ మేళకర్తరాగముల సంఖ్య లేవనగా?

| మేళకర్తలపేర్లు. | | | | మేళకర్తలసంఖ్యలు. |
|---|---|---|---|---|
| (i) వరుణప్రియ ... | ... | ... | 24వ, | మేళకర్త |
| (ii) నాగానందిని... | ... | ... | 30వ, | మేళకర్త |
| (iii) హేమవతి ... | ... | ... | 58వ, | మేళకర్త |

(c) క,ట,ప, యాది చక్రప్రయోగ వివరమేమనగా;- మేళకర్తలయొక్క వరుస సంఖ్యలను సులభముగ నెరుంగుటకై సూత్రముగ యీక్రిందగనుబఱచిన విధమున క,ట,ప, యాదిచక్రప్రయోగమునుపూర్వాచార్యులు యేర్పరచియున్నారు.

| కటపయాదిసంఖ్యలు. | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) కాదినవకము. | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| (2) టాదినవకము. | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| (3) పాదిపంచకము. | ప | ఫ | బ | భ | మ | | | | | |
| (4) యాద్యష్టకము. | య | ర | ల | వ | శ | ష | స | హ | | |

72 మేళకర్తరాగములలో నేదైన నొకరాగముయొక్కసంఖ్యను కనుగొనవలెననినచో ఆమేళకర్తరాగముయొక్క పేరునందుగల యక్షరములలో మొదటి యక్షరము, పైనిగను బఱచిన కటపయాదిపథకమునందుగల నాల్గువరుసలలో నెచ్చటగలదో గుర్తించి ఆయక్షరమునకు పైనివేయబడిన సంఖ్యను కనుగొనవలెను. ఇదేవిధముగా రెండవ యక్షరమునుగూడా కటపయాది చక్రమునందెచ్చటగలదో గుర్తించి ఆయక్షరమునకు పైనివేయబడిన సంఖ్యను కనుగొని, మొదట గనుగొనిన సంఖ్యయొక్క ప్రక్కను రెండవసారి గనుగొనిన సంఖ్యనుజేర్చి

ఈ రెండు సంఖ్యలను త్రిప్పివేసిన యేర్పడు సంఖ్య ఆ మేళకర్త సంఖ్యయగును- ఉదా:—మాయామాళవగౌళ. ఈరాగము యొక్కసంఖ్యను కనుగొనవలెననిన ఈ పేరునందుగల మొదటి అక్షరమగు "మా" పాదిపంచకములో అయిదవ సంఖ్య క్రింనుండుటచే 5వ, సంఖ్యయగును. రెండవ యక్షరమగు "యా" యాద్యష్టములో మొదటి సంఖ్య క్రిందనుండుటచే 1వ సంఖ్య యగును. ఈరెండు సంఖ్యలను వరుసగాజేర్చిన 51వ సంఖ్యయగును. త్రిప్పివేసిన 15వ,సంఖ్యయగును.గనుక నీ మాయామాళవగౌళరాగము 15వ, మేళకర్తయని చెప్పబడును.ఇదేవిధముగ తక్కిన మేళకర్తలయొక్క సంఖ్యలనుగూడగనుగొనవచ్చును. ఇట్లు గనుగొనునపుడు "న" అను అక్షరము వచ్చునెడ శూన్యముగానెంచి సున్న (0) యని లెక్కచేయదగును. ఉ:- కనకాంగి. ఇందు మొదటియక్షరమగు "క" కాదినవకములో మొదటిసంఖ్య క్రిందనుండుటచే 1వ సంఖ్యగను, రెండవ యక్షరమగు"న"శూన్యమగునుగనుక ఆసున్నను 1వసంఖ్య ప్రక్కన వేసి మరల త్రిప్పివేసిన 01 సంఖ్యయగును. సంఖ్యకు ముందుగల సున్నకు విలువలేనందున "కనకాంగి" 1వ, సంఖ్యగల మేళకర్తయగును. మరియు నీ 72 మేళకర్తలలో సంయుక్తాక్షరములుగల నీడగువ మేళకర్తలసంఖ్యలను గనుగొనునపుడు ఈ క్రిందివిధముగ లెక్కించి సంఖ్యలను కనుగొనవలెను.

| సంయుక్తాక్షరము గలమేళకర్తల పేర్లు. | సంయుక్తాక్షరముల విభజించువివరము. | | | | మేళకర్త సంఖ్యలు. |
|---|---|---|---|---|---|
| రత్నాంగి | రత్ నాం గి | | 20 | త్రిప్పివేసిన | 2 |
| చక్రవాకము | చ క్ర వాకము | | 61 | ,, | 16 |
| సూర్యకాంతము | సూర్ య కాంతము | | 71 | ,, | 17 |
| షడ్విధమార్గిణి | షడ్ వి ధమార్గిణి | | 64 | ,, | 46 |
| దివ్యమణి | ది వ్య మణి | | 84 | ,, | 48 |
| విశ్వంబరి | వి శ్వం బరి | | 45 | ,, | 54 |
| షణ్ముఖప్రియ | షణ్ ము ఖప్రియ | | 65 | ,, | 56 |
| సింహేంద్రమధ్యమము | సి ంహేంద్రమధ్య | | 75 | ,, | 57 |
| ధర్మవతి | ధర్ మ వతి మము | | 95 | ,, | 59 |
| చిత్రాంబరి | చి త్రా ంబరి | | 66 | ,, | 66 |

పై దెలిపిన మేళకర్తరాగములలోని మొదటి రెండక్షరములలో సంయుక్తాక్షరములను విడదీసి అందుగుర్తుగాగనుపడిచిన మొదటి అక్షరములనే లెక్కించి మేళకర్తలసంఖ్యలను కనుగొనవలెను. ఇదేకటపయాది చక్రప్రయోగ వివరము.

**2.** (a) ఆరోహణ అవరోహణములలో సప్తస్వరములు వచ్చునట్టి కొన్ని జన్యరాగములేవనగా:—

(i) భైరవి (ii) శంకరాభరణము (iii) కల్యాణి మొదలగునవి.

పై జన్యరాగములకును వాని జనకరాగములకును గల భేదము యెట్లుకలుగుననగా?

వీటియొక్క జనకరాగముల నామములు ముఖ్యముగా కటపయాది విధులననుసరించియుండును. మరియు ఆరోహణావ

రోహణములందుగల సప్తస్వరము లీక్రిందిరీతిగా నుండును:—

(i) సంపూర్ణమైన విశిష్టతను కలిగియుండును.

(ii) ఒకే క్రమవిధానములో హెచ్చి తగ్గుచుండును.

(iii) ఒకేజాతికిచెందినవిగా నుండును. ఇటుల పై విధముగ వాని జనకరాగములకుగల మూడువిశేషణములివిగానున్నవి.

అయితే ఈజన్యరాగములు వానిజనకరాగములకుగల పై మూడువిశేషణములను గలిగియుండక పోవుటయేగాక ఈ క్రిందదెలుపబడిన ఆయా విషయములందుగూడ భేదము కలుగుట గమనింపదగును.

(i) భైరవిరాగము:— దీని జనకరాగము 20 మేళకర్తయగు నఠభైరవి. ఈనఠభైరవికిని, దీనిజన్యరాగమైన భైరవికిని సహజముగా సప్తస్వరములొకేజాతికి చెందిన వగుటచే శుద్ధధైవతమే నియతశృతియైనను జన్యరాగమైన భైరవి రాగమున పధ²నిస–పధ²నిసరీ అనుసంచారములందు రంజనము కొఱకు అన్యస్వరముగా చతుశ్రుతధైవతము ప్రయోగింపబడుచున్నది. దీనిజనకరాగమైన నఠభైరవి కిట్టిఅన్యస్వరప్రయోగము లేమియునుండవు.

(ii) శంకరాభరణరాగము:—దీని జనకరాగము 29వ మేళకర్తయగు ధీరశంకరాభరణరాగము. ఈరెండు రాగములకును ఆరోహణావరోహణములందుగల సప్తస్వరములు ఒకేరకమునకు చెందినవియైనను జన్యరాగమైన శంకరాభరణమున

ముఖ్యముగా, సధపమ, యను నిషాదవర్జమైనసంచారములును, మరియు సనిపమ, యను ధైవతవర్జముగల సంచారములుండును. వీని జనకరాగమైన ధీరశంకరాభరణమున కిట్టి వర్జముగల సంచారములేమి యుండవు.

(iii) కల్యాణిరాగము:—దీని జనకరాగము 65వ, మేళకర్తయగు మేచకల్యాణిరాగము. ఈ రెండు రాగములకు ఆరోహణ అవరోహణములందుగల సప్తస్వరములు ఒకేజాతికి చెందినవైనను జన్యరాగమైన కల్యాణిరాగమున "గగధధనినిరిరి" అను మధ్యమవర్జమగు జంటస్వరసంచారములును ధనిరిగమధని-రినిధమగరిని" ఇటుల షడ్జ, పంచమవర్జమగు సంచారములును నిగరిని-ధనిరినిధమ-గనిధమ మొదలగు దాటుస్వరప్రయోగములును వచ్చుచున్నవి. దీని జనకరాగమైన మేచకల్యాణిరాగమునకిట్టి సంచారములుండవు.

మరియునిట్టి సంపూర్ణ జన్యరాగములలో కొన్నిటికి ఆరోహణమందుగాని లేక అవరోహణమునందుగాని లేక రెండిటియందుగాని ఒకటి లేక రెండు స్వరములు వక్రముగూడ గలిగియుండును. ఉదా:- సహానా, బేగడ, సారంగ మొదలగునవి. వీని జనకరాగములైన హరికాంభోజి, ధీరశంకరాభరణము, మేచకల్యాణిరాగముల కిట్టివక్రములుండవు. ఈవిధముగా పై జన్య,జనక రాగములకనేకవిషయములందు భేదముకలుగుచున్నది.

(b) (i) కాంభోజి:— ఇందువచ్చు అన్యస్వరము కాకలీ నిషాదము. ఈరాగమును సంచారముజేయునపుడు సని$^{3}$పధసా, ని$^{3}$పధసా యను సంచారములందు అన్యస్వరముగా కాకలీ నిషాదము బలుకును.

(ii) బిలహరి:— ఇందువచ్చు అన్యస్వరము కైశికీనిషాదము. ఈరాగమును సంచారముజేయునపుడు గపధని ధాపమగా-పని$^{2}$ధపమగరీ-గని$^{2}$ధపమగరీ మొదలగు సంచారములందు అన్యస్వరముగా కైశికీనిషాదము బలుకును.

(iii) సారంగ:— ఇందువచ్చు అన్యస్వరము శుద్ధమధ్యమము. ఈరాగమును సంచరించునపుడు పమరిగమ$^{1}$రిస-రిగమ$^{1}$రిస మొదలగు సంచారములందు అన్యస్వరముగా శుద్ధమధ్యమము బలుకును.

**౩.** (i) తోడిరాగలక్షణము:— ఇది 22వ,పుటయందుగల 1930వ,సంవత్సరములోని 7వ, ప్రశ్నయొక్క4వ జవాబునందు వ్రాయబడుట గమనింపదగును.

(ii) ముఖారిరాగలక్షణము:—ఇది 22వ, మేళకర్తయగు ఖరహరప్రియరాగమునందుజనించిన జన్యరాగమైయున్నది.

ఆరోహణము:— స రి$^{2}$ మ$^{1}$ ప ధ$^{2}$ ని$^{2}$ ధ$^{2}$ స.

అవరోహణము:— స ని$^{2}$ ధ$^{1}$ ప మ$^{1}$ గ$^{2}$ రి$^{2}$ స.

ఇది భాషాంగము. వక్రషాడవసంపూర్ణము. షడ్జగ్రహము. రక్తిరాగము. ఆరోహణమందు గాంధారము వర్జము. ఎల్లప్పుడును గానము సేయదగును. ఈరాగమునందు చతుశ్రుతిరిషభ, శుద్ధమధ్యమ, కైశికీనిషాదములు మిగుల రంజనము గలిగించు జీవస్వరములుగానున్నవి. ఆరోహణమునందు చతుశ్రుతిధైవతము అవరోహణమందు సాధారణగాంధారము రాగచ్ఛాయాస్వరములుగానున్నవి. అవరోహణమందుమాత్రము శుద్ధధైవతమునే ప్రయోగింపుచు సమయోచితముగ చతుశ్రుతిధైవతమునుగూడ ప్రయోగించుట వాడుకగాయున్నది. పూర్వీకులీ ముఖారిని 20వ, నఠభైరవి జన్యమనియే చెప్పియున్నను చతుశ్రుతిధైవతప్రయోగమే యీకాలమున కొంచెమెక్కువగ వాడుటవలన నీ ముఖారిని 22వ, మేళకర్త జన్యమనియే జెప్పబడుచున్నది. గనుక శుద్ధధైవత ప్రయోగమే ఈ రాగమునకు అన్యస్వరముగా నున్నదని దెలియనగును.

ఇందుగల ముఖ్యసంచారములు,—

రిమపధనిధసాసా-సరిగరిసానిధ$^{1}$పా-మపధ$^{1}$పమగరిసా-సరిమాగరి-రిమపనీధ మపధసా-పధసరిమాగరిసా-సరిగసా-నిధమపధసానిధ$^{1}$పా-మధ$^{1}$పమగరి-సరిపమగరిసా-నిధధాసా మొదలగునవి.

(iii) సహానారాగలక్షణము:—ఇది 21వ పుటయందుగల 1930వ, సంవత్సరములోని 7వ, ప్రశ్నయొక్క 3వ జవాబునందువ్రాయబడుట గమనించునది.

(iv) హంసధ్వనిరాగలక్షణము.—ఇది 29వ, మేళకర్త యగు ధీరశంకరాభరణరాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:— స రి2 గ3 ప ని3 స.

అవరోహణము;— స ని3 ప గ3 రి2 స.

ఉపాంగరాగము. ఔడవరాగము. షడ్జగ్రహము. మధ్యమ, ధైవతములు వర్జ్యము. ఎల్లప్పుడును గానము సేయదగును. ఈరాగమున గాంధార నిషాదములు మిగుల రంజనము గలిగించు జీవస్వరములుగానున్నవి. ఈరాగమున సగ, రిప, గని, పస,నిరి,నిగ,రిపగరిసనిపరిస మొదలగు దాటుస్వర ప్రయోగములు మిగుల ముఖ్యముగా నున్నవి. ఈరాగము గాయకశ్రేష్ఠులగు శ్రీరామస్వామి దీక్షితులవారిచే కల్పింపబడినది.

ఇందుగల ముఖ్య సంచారములు:—

సరిగపనిసాసా-సరిసనిపా-పనిసరిగా-గరిగపగారిసా-నిగరిసనిపా-గనిప-గపగా-రిపగరిసా-నిరిసనిపసనిరీసా మొదలగునవి.

**4.** (a) 35 తాళములలో ఆవర్తమొకటికి 11 అక్షరకాలము వచ్చునట్టి 3 తాళములేవనగా?

| తాళములపేర్లు. | అంగసంజ్ఞలు. | అక్షరవివరము. | అక్షరసంఖ్య |
|---|---|---|---|
| (i) త్రిశ్రజాతి | | | |
| ధృవము. | $I_3 \; 0 \; I_3 \; I_3$ | ...3+2+3+3...= | 11 |

(ii) మిశ్రజాతి
త్రిపుట. ...$|_7$ 0 0 ...7+2+2 ...= 11
(iii) సంకీర్ణజాతి
రూపకము. ...0 $|_9$ ...2+9 ...= 11

(b) రాగమాలికాలక్షణము:—ఇయ్యది పల్లవి, అనుపల్లవి, చరణములుకలిగిన ఒకఅందమైన సంగీతరచన. వీనిలో కొన్ని ఒకపల్లవి అనేకచరణములుగా కూడనుండును. ఇందుగల పల్లవిచరణములు వేర్వేరు రాగములలో రచియింపబడి పల్లవి చరణములందుగల సాహిత్యములకును ఆయారాగముల పేర్లకును అనుబంధముకలిగి అర్థము చెడకుండునటుల తగునేర్పుతో రచింపబడియుండును. సాధారణముగా అనుపల్లవి లేక పల్లవికిని ప్రతిచరణమునకు నొకచిట్టస్వరముండును. ఈరాగమాలికలలోని మాతువునందుగల విషయము భక్తిరసమునకుగాని శృంగారరసమునకుగాని సంబంధించియుండును. పొడుగైన రాగమాలికలను కొన్నిసమయములలో తరగతులుగా విభజింతురు. ప్రతిరాగమాలికా అంత్యమందునులేక దానిలోని గములచిభావరయందును సాధారణముగ నిండుఆవర్తస్వరముల తోగాని అర్ధఆవర్తస్వరములతోగాని మాలికగానేర్పడియుండు వేర్వేరురాగములందుగల యీస్వరములు రాగములకు విలోమక్రమముగ నుండును. ఇవిపాడిన పిమ్మట పల్లవి యెత్తుకొనబడును. ఇట్లుపాడుటవలన రాగమాలికయందు విశేష రంజనమును పెంపొందించును. ఇదియే రాగమాలికలక్షణము.

**5.** (a)(i) శార్ఙ్గదేవుడు:- ఇతడు కాశ్మీరదేశస్థుడు.

వత్సగణ ఋషిగోత్రీకుడు. తండ్రి శౌడ్డలదేవుడు. తాతభాస్కరుడు. ఇతడు గానన్నృత్యముల గురించి "అధ్యాత్మవివేక" మను వేదాంతగ్రంథము వ్రాయుటచే "నిశ్శంక" (సంశయము లులేనివాడు) యను బిరుదము వహించెను. 1210-1247 లో యీతడు రచించిన "సంగీతరత్నాకరము" కర్నాటకసంగీత కమునందొక గొప్ప ప్రమాణగ్రంథముగా నేటికిని యెంచబడుచున్నది. ఇది సంస్కృతమున వ్రాయబడినది.

(ii) జయదేవులు:—ఈతడు బెంగాలులో "దిందుబిల్వమ్" నందుజన్మించెను. 12వ, శతాబ్దములోనివాడు. భార్య పద్మావతి. కృష్ణభక్తురాలు. ఈతడు రచించిన "గీతగోవింద" మను శృంగారమహాకావ్యమునందు రాధాకృష్ణ ప్రేమతత్వ మును అష్టపదులుగ వ్రాయబడెను. ఇవి నాయక, నాయికి సఖులచే పాడబడినటుల కీర్తనకు 8పాదములవంతున 24కీర్తనలును 12 స్వర్గలలో వ్రాయబడెను. సంగీత కీర్తనలకీ అష్టపదులే ప్రప్రథమములుగా చెప్పబడుచున్నవి.

(iii) రామామాత్యుడు:—ఈతడు తెలుగు నియోగి బ్రాహ్మణుడు. తండ్రి తిమ్మామాత్యుడు. 1550లో విజయనగరరామదేవరాజు కోరికపై "స్వరమేళ కళానిధి" వ్రాసెను. ఇందు స్వర, వీణ, మేళ, రాగములు చర్చింపబడినవి. జనక జన్యరాగ పద్ధతిని గురించి వ్రాసెను. 20 మేళములు కొన్ని జన్యరాగములు వ్రాసెను. ఉత్తమ, మధ్యమ, అధమ రాగ విభాగము జేసి వ్రాసెను. ముఖారిరాగమీతనికి శుద్ధప్రమాణము. శార్ఙ్గదేవుని 12 వికృత స్వరముల పద్ధతికి వ్యతిరే

కించి యీతఁడు ఏడింటిని మాత్రమే పేర్కొనెను. ఇప్పటి కాలమునవాడు 4 తంత్రుల వీణ యీతనికాలముననే బయలు దేరెను. ఇతనికి "అభినవ భరతాచార్య" యని బిరుదు గలదు. యీతని గ్రంథముగూడ కర్నాటక సంగీతముననొక ప్రమాణ గ్రంథముగ నేటికిని యెంచబడుచున్నది.

(iv) సోమనాథుడు:—ఈతడు ఆంధ్రుడు. 1609 లో "రాగ విభోధ" మను సంగీతలక్షణ గ్రంథమును రామామాత్యుని రచన ననుసరించి వ్రాసెను. ఇందు తనకాలమున గల 23 మేళములును వాని జన్యరాగములను వ్రాసెను. 15 వికృత స్వరముల నాధారము చేసుకొని 960 మేళములను పేర్కొనెను. ఇదియొక గొప్ప సంగీతలక్షణ గ్రంథమై యున్నది.

(v) వెంకటమఖి:—ఈతడు గోవిందదీక్షితారుని రెండవకుమారుడు. మొదట సోదరుడగు యజ్ఞనారాయణ దీక్షితారుని వద్దను, పిదప ఉత్తరదేశపు గొప్పగాయకుడగు తానప్పాచార్యుని వద్దను సంగీత మభ్యసించి వృద్ధికివచ్చెను. 1660 లో విజయరాఘవ భూపాలుని కోర్కెపై "చతుర్దండి ప్రకాశిక" యను గ్రంథమును రచించెను. ఇందు వీణ, శృతి, స్వర, మేళ, రాగ, ఆలాప, తాన, గీత, ప్రబంధ, తాళములను చర్చించెను. రాగాంగ, ఉపాంగ, భాషాంగ, రాగముల లక్షణములబట్టి శ్లోకములు వ్రాయుచు గీతములనుగూడ నుదహరించెను. కొన్ని ఉపాంగములు భాషాంగములైన విధముగూడ తన రచనలో దెలిపెను. రాగచరిత్రముల నెరుగుటకు వీరిలక్షణ గీతము లెంతో ప్రయోజనముగా నున్నవి. మరియు జయదే

వు ననుసరించి యీతడు త్యాగరాజస్వామిని స్తుతించుచు 24 అష్టపదులుకూడ వ్రాసెను. వీరి గ్రంథరచనమువలన కర్ణాటక సంగీతము కొన్నిమార్పులతో నొక పద్ధతి యేర్పడెను.

(vi) పురందర విఠల్:—ఈతడు 16వ, శతాబ్దములోనివాడు. తండ్రి వరదప్ప. గొప్ప ధనికుడు. పండరినాథుని భక్తుడగుటచే తనయాస్తినంతయు దానధర్మములు చేసెను. వేదోపనిషత్తులను ప్రజలకు బోధించెను. దేవరనామములు కన్నడమున వ్రాసితరించెను. సంగీతమును బోధనకుతగినటుల స్వరావళి, అలంకారములు,పిళ్లారిగీతములు,తాయములు, సూళాదులు, ప్రబంధములు రచించెను. ప్రారంభకులకు తగినటుల స్వరావళిని "మాయామాళవగౌళ" రాగమున భోదించుట యితడే ప్రారంభించెను. ఈతనికి "కర్ణాటక సంగీత పితామహ" యని బిరుదుగలదు.

(vii) నారాయణతీర్థయతీంద్రులు:— ఈతడు 16వ శతాబ్దములోనివాడు. ఆంధ్ర బ్రాహ్మణుడు. కృష్ణాజిల్లా వాస్తవ్యుడు. "శ్రీకృష్ణ లీలాతరంగిణి" ని 12 స్వర్గలలో వ్రాసి తరించిన మహానుభావుడు. వీరి మహిమలను గురించిన కథలనేకము గలవు. వీరు సంచారార్థము దక్షిణదేశమునకువెళ్లి నడుక్ కావేరి గ్రామములో నిద్రించునపుడు స్వప్నమున గలిగిన దైవాజ్ఞచే నొక పందిని వెంబడింప నది వెంకటరమణ స్వామి ఆలయమునకేగి అదృశ్యమయ్యెను. వెంటనే తనతరంగిణీనిగానము చేసి శిష్యులకు నేర్పెను. భూపతిరాజపురమగు ఈ వరాహపురిలోనున్న వీరిసమాధియందు నేటికి వీరిఛాయాపట

ముగలదు. శ్రీకృష్ణజయంతికి భక్తులనేకులు యచ్చటకు వెళ్ళి తరంగములు పాడుచు భజనలుసల్పుదురు. వీరి తరంగరచనలు నేటికిని మిక్కిలి ప్రసిద్ధిగానుండి భజనలయందును, తదితరకాలక్షేపములందును మిక్కిలివిశేషముగా పాడబడుచున్నవి.

(viii) భద్రాచల రామదాసు:—ఇతడు 16వ శతాబ్దములోనివాడు. తెలుగు నియోగిబ్రాహ్మణుడు. భద్రాచలము తహశీలుదారుగా నున్నపుడు సర్కారు ధనమును రామకైంకర్యార్థము వినియోగించినందున 12సంవత్సరములు శిక్షనొందెను. రామలక్ష్మణులు తానీషాకు ధనము చెల్లించి తమ దాసుని విడుపించుకొనిరి. ఇతడు బందిఖానాయందు రచించిన కీర్తనలు హృదయరంజకములై కర్నాటక సంగీతము కెంతయు ప్రాముఖ్యముగా నున్నవి. త్యాగరాజు రచించిన దేవగాంధారిరాగములోని క్షీరసాగరశయన కృతియందు రామదాసుని పేర్కొనెను. పైని దెలుపబడినటుల త్యాగరాజుకు పూర్వముగల శార్ఙ్గదేవాది ముఖ్యవాగ్గేయకారకులచే రచింపబడిన సంగీతలక్షణ వివరముల వలనను, స్వరావళి, అలంకార, గీత, తాయ, ప్రబంధ, సూళాదులవలనను కీర్తన, తరంగ అష్టపదులాదిగాగల యనేక ముఖ్యమైనసంగీతరచనలవల్లను కర్నాటక సంగీతము మిక్కిలి అభివృద్ధిచెందినదై యున్నది.

(b) త్యాగరాజుగారిరచనలలో మంచివిశేషముగల నొకకృతి ఏదనగా? గౌళిపంతు రాగమందలి "తెరతీయగరాదా" ఒకప్పుడు త్యాగరాజులవారు తన శిష్యులతోగూడి పయనమై తిరుపతి క్షేత్రమునందుగల పద్మావతీ కాంతుడయిన శ్రీని

వాసమూర్తిని దర్శించుటకై ఆలయమునకు బోగా వీరు దివ్య మూర్తిని దర్శించుటకు వీలులేనట్లు తెరవేయబడియుండెను. అప్పుడు త్యాగయ్యగారు తానుచేసిన పాపమే తెరవలెనచ్చి అడ్డుపెట్టుచున్నదని యూహించి "తెరతీయగరాదా నాలోని తిరుపతివేంకటరమణ మత్సరమను" అనెడికృతిని పాడగనే తక్షణమే తెర తెగి క్రిందకూలెను. వెంటనే త్యాగయ్యగారు మహదానందమున శ్రీవెంకటేశ్వరస్వామిని దర్శించి నమస్కరించి "వెంకటేశా" అనెడికీర్తనముచే స్తోత్రముచేసి మరలివచ్చియుండిరి. ఇదివీరిరచనలలో ఒకమంచి విశేషముగల కృతి. ఇటులనే యింకను వీరి కృతులలో కొన్నిటికి మిక్కిలి విశేషముగలదు.

**6** (i) దేశీయరాగముఅనగా:—ఇతర దేశముల నుండి తేబడిగాని ఇతరదేశీయరాగసంప్రదాయము కలసిగానియుండిఘున, రక్తిరాగముల సంప్రదాయము కలిగియున్న రాగమునకు దేశీయరాగమనిపేరు. ఉదా:- ఖమాసు, సురటి, కానడ, హిందూస్తానికాఫి, సహానా, మొదలగునవి.

(ii) పదము అనగా:—దీనివివరము 18 వ పుటయందుగల 1930వ సంవత్సరపు 6వ ప్రశ్నలోని 3వ, జవాబునందు వ్రాయబడుట గమనించునది.

(iii) సంగతి అనగా:—సంగీతరచనయొక్క భాగములందుగాని లేకపదజాలమునందుగాని రంజకముకొరకై రాగతాళములననుసరించి భావసంపత్తితో పాడబడు హెచ్చుతగ్గుల మార్పునకు సంగతియని చెప్పబడును.

(iv) మనోధర్మ సంగీతము అనగా:—ఊహాశక్తి నిబట్టి మనస్సునకు తోచినటుల కల్పనజేసి రంజకముగ గానము జేయుట మనోధర్మసంగీత మనబడును. ఎటులనగా సాధారణముగా కచ్చేరీలలో ప్రదర్శింపబడు సంగీతము ఈక్రింద దెలిపినటుల రెండువిధములుగా నుండును.

(i) ప్రదర్శకుడు పూర్వీకవిఖ్యాతరచయితల యొక్క సంగీతరచనలను అనగా యిదివరకే అమలులోనున్నసంగీతమును గాత్రమునగాని జంత్రమునగాని గానము చేయుట.

(ii) ప్రదర్శకుడు తనఅద్భుతమేధాశక్తి వలనఅప్పటికప్పుడు స్వయముగా సృష్టించినసంగీతమును గాత్రమునగాని జంత్రమునగాని ప్రదర్శించుట.

పై దెలిపిన రెండవతరగతినే మనోధర్మసంగీతమని గాని లేక ఊహాశక్తి నిబట్టి పాడు సంగీతమనిగాని చెప్పుదురు. ఇదినాలుగు విధములుగా నుండును.

(i) రాగ-ఆలాపన (ii) మధ్యమకాల లేక తానమ్, (iii) పల్లవి, (iv) స్వరముపాడుట. కృతులలోని సాహిత్యప్రస్తారమును, అరవమునందుగల నిరవల్ (Neraval) లును పై మనోధర్మసంగీతములోని రకములై యున్నవి. ఇదేమనోధర్మ సంగీతవివరము.

**7.** (a) తంత్రీవాద్యముల విభాగములేవనగా?

ఇవి మూడువిధములుగా విభజింపబడుచున్నవి.

(i) తంత్రులను కమాను (Bow)తో రాపిడి జేయుట వల న ధ్వని ఉద్భవించు వాద్యములు.

ఉ॥ వయొలిన్, (ఫిడీలు) సారంగి, దిల్‌రుబ, బాలసరస్వతి లేక తాఫ్రూస్, (మయూరి) ఎస్రాజ్ మొదలగునవి.

(ii) తంత్రులను వేళ్ళతో మీటిన ధ్వనిజనించు వాద్యములు.

ఉ॥ వీణ, రుద్రవీణ, గోటువాద్యము, సితార్, స్వరబత్ లేక స్వరగత్, సరోడ్ (Sarode), గిటార్ (Guitar), మాండోలిన్ (Mandoline), హార్ప్ మొదలగునవి. ఇవిగాక తంబుర, ఏక్తార్ వంటి శృతివాద్యములు గూడ యిందులో చేరినవై యున్నవి.

(iii) తంత్రులను ఒకసుత్తితోగాని లేక కొయ్యతో చేయబడిన రెండుపుల్లలతోగాని కొట్టుటవలన ధ్వని యేర్పడు వాద్యములు.

ఉ॥ పియానోఫోర్ట్, స్వరమండల, గెత్తువాద్యము మొదలగునవి.

పై దెలుపబడినటుల కమాను(Bow)తోగాని లేక వేళ్ళ సహాయముతోగాని వాయింపబడు తంత్రీవాద్యములు మరియొకమూడువిధములుగా విభజింప వచ్చును. ఎటులనగా:—

(i) వేళ్లుఆనుకొనేందుకు ఒకచదునైన బల్లకలిగియుండి దానిని అనుకొనునటుల తంత్రులనదిమివాయింపబడు వాద్య

ములు ఉ॥ వయొలిన్ (ఫిడీలు) సరోడ్ (Sarode) మొదలగునవి.

(ii) వేళ్ళు ఆనుకొనేందుకు మెట్లుగలిగి ఆమెట్లనాను కొనునటుల తంత్రులనదిమి వాయింపబడు వాద్యములు ఉ॥ వీణ, సితార్, తంబూర మొదలగునవి.

(iii) పై విధమున బల్లగాని మెట్లుగానిలేకను, వేళ్ళతో గాక, పిడివంటి ఒకచిన్న గుండ్రని కొయ్యముక్కలో తంత్రుల నదిమివాయింపబడు వాద్యములు ఉ॥ గోటువాద్యము మొదలైనవి. ఇదే తంత్రీవాద్యముల విభాగముల గురించిన వివరము.

## (b) వీణావాద్య భాగముల గురించిన వ్యాసము.



ఈపటమునందు జూపబడిన వాద్యము వీణావాద్యము. ఇయ్యది వాద్యవిభాగములలో తంత్రీవాద్యములో చేరినదియై యున్నది. ఈ వీణలలో పలురకములు గలవు.

(i) ఉత్తర హిందూ స్థానములో నుపయోగింపబడు వీణలు. ఇవి నాల్గడుగుల పొడవు కలిగిన వెదురుకఱ్ఱతో చేయబడి దానిమీద మెట్లు అమర్చబడియుండును. ఈ వాద్యమునకు ఆ వెదురు కఱ్ఱయే, వేళ్ళు ఆనుకొనే చదునైన బల్ల (Finger board) గా నుండును. దీనికి రెండువైపులను పెట్టెల

వలె నుండు రెండు బుర్రలు, వీణకు ఆధారభూతముగా నుండి ఎక్కువ ధ్వనినిచ్చును. ఈరకము వీణలను సుందరి, రుద్రవీణ లేక రస్‌బిన్ (Rus bin) అని చెప్పుదురు.

(ii) దక్షిణ హిందూదేశములో వాడబడు వీణలు. ఇవిసాధారణముగా పనసకర్ర మొదలైనకర్ర (Jack Wood) తో తయారుచేయుదురు. దీనిలోఎక్కువ ధ్వనినిచ్చుటకై ఏర్ప రచినపెట్టెను కుండ (Kodam) అని చెప్పుదురు. ఇది ఒక బం తిలో కైవ, వంతు సైజు గలిగియుండును. దానికి ఒక వైపు తెఱచియుండును. ఇచ్చటనే దీనిని వేళ్ళు అనుకునే చదునైన బల్ల (ఫింగర్ బోర్డు)తో కలుపబడును. ఈ కుండయొక్క లోతు 9 అంగుళములమొదలు 10-½ అంగుళముల వరకునుం డును. కుండలోతు ఎంతఎక్కువగానుండిన ధ్వని అంతగంభీరము గానుండును. కుండపైభాగమున తెఱచియున్న వైపున పళ్లెము వంటి ఒక గుండ్రని చదునైన చెక్కతో మూయబడియుండు ను. దీని వ్యాసము (అడ్డకొలత) కుండయొక్క సైజును బట్టి యుండును. అనగా మిక్కిలి పెద్దవీణలకు 13 అంగుళములును మధ్యరకపు వీణలకు 12-½ అంగుళములును, చిన్నవీణలకు 9-½ మొదలు 12-½ అంగుళములవరకును వ్యాసము గలిగి యుండును. ఈ కుండను, వేళ్ళు అనుకొనే చదునైన బల్ల (దండము) అనబడుకర్రతో జతచేసి యీ రెండిటిని యాళి (Yali) యొక్క కంఠము, ముఖములకు జత చేయుదురు. ఆ యాళి యొక్క ముఖము సర్పముఖమును బోలియుండును. దండముమీద ప్రత్యేకముగ తయారు చేయబడిన మైనము

తో 24 మెట్లు నమర్చబడియుండును. ఒక్కొక్క మెట్టు ఒక్కొక్క స్వరము లేక ధ్వని యొక్క హెచ్చును దెలుపుచుండును.

వీణకు మొత్తము 7 తంత్రులుండును. అందు మొదటి నాలుగు తంత్రులు దండముమీద నమర్చబడియుండును, వీనికి మీదితంత్రులని పేరు. మిగత మూడు తంత్రులు ఎడమపక్క నమర్చబడియుండును. వీనికి పక్క తంత్రులని పేరు. మీది తంత్రులు 4ను, కుండమీద నమర్చబడిన లోహపు రేకు గలిగిన కొయ్యపీట (Bridge) మీద అనుకొనునటుల వేయబడి కంఠముననుండు చెవులనబడు బిరడాలకు చుట్టబడును. పక్క తంత్రులు 3ను, కుండమీద నమర్చబడిన పీటపక్క,నర్ధచంద్రాకారముగ నుండు లోహపు పీటమీద అనుకొనునటుల వేయబడి దండము పక్కనుండు బిరడాలకు చుట్టబడియుండును. కుండకు దూరముగ రెండవ చివరను మరియొక బుర్ర యుండును. ఇది వీణను సరియైన మట్టములో నుండునట్లు చేయుటయే గాక వీణావాద్యముయొక్క ధ్వనిమాధుర్యమును పెంపొందింప జేయును.

వీణయొక్క కుండలి (సప్తతంత్రులు ప్రారంభమగు చోటు) మొదలు శిరస్సువరకు గల భాగమును 6 ఆధారములు(Nerve centres=ఆయువుపట్లు)గా భాగించిరి.అవియేవనగా?

1 మూలాధార ... అన్నితంత్రులుముడివేయబడినచోటు.
2 స్వాదిస్థాన ... పీట (బ్రిడ్జి) అమర్చబడినచోటు.
3 మణిపుర ... 24వ, మెట్టు అమర్చబడినచోటు.

4 అనాహత ... 19వ, మెట్టు అమర్చబడిన చోటు
5 విశుద్ధ ... 12వ, ,, ,,
6 అజనాయ ... 7వ, ,, ,,

పై దెలిపిన 6 ఆధారములును ఇందుజూపిన వీణావాద్యమునందు వరుసగానుండుట గమనింపదగును. ఇవియేను, ఒక్కొక్కదానికిగల 12,000 నాళములద్వారా 12,000 రాగముల వంతున 6 × 12,000=72,000 రాగములనుసృష్టింపగల శక్తిగల విగానున్నవని దెలియుచున్నది. ఇదే వీణయొక్క అన్నిభాగముల గురించిన ముఖ్యమైన వ్యాసము.

## 8. (a) శ్రీ త్యాగరాజ విరచితము.

### మోహనరాగము. ఆదితాళము.

ప. నన్ను పాలింప నడచివచ్చితివో–నా ప్రాణనాథ ॥నన్ను॥

అ. వనజనయన మోమునుజూచుటే జీవనమని నెనరున మనసుమర్మము దెలసి॥న॥

చ. సురపతినీలమణి నిభతనువుతో – ఉరమున ముత్యపు సరులచయముతో
కరమున శరకోదండకాంతితో – ధరణితనయతో త్యాగరాజార్చిత ॥నన్ను॥

తాత్పర్యము:–పద్మసమానమైన ముఖముతో, నీలమేఘచ్ఛాయ కలిగినదేహముతో, కంఠమున ముత్యాలహారములతో, హస్తమున విల్లంబులతో, ఆ సీతామహాసాధ్వితో త్యాగరాజుచే పూజింపబడు రామా నామనోభావ మెరిగి నన్ను పాలింపవచ్చితివా? అని త్యాగయ్యగారు శ్రీరాముని అనేక విధముల కొనియాడుచున్నారు.

| | | I | 0 | 0 | |
|---|---|---|---|---|---|
| ప. | ;* | గ ప రీ రీ – సా ;; – సధ | ధప – ధసా – | గాగా – గరిరిస | |
| | ;* | న న్ను . . – లిం ;; – ప . | . . – న డ చి వ – | చ్చి తి – వో... | ‖ |
| 2 | రీ* | గ ప రీ రీ – సరిగపగారీసాసధ | ధప – ధసారిగా – | గాధప – గ రిరిస | ‖ |
| | .* | నన్ను . . – లిం . . . . . ప. | . . – న డ చి వ – | చ్చితి . – వో ... | ‖ |
| 3 | రీ* | గాధప గరీ – సరిగపగారీసాసధ | ,, | పధసాధాపా – ధపగరి | ‖ |
| | .* | నన్ను. . . – లిం . . . . . ప. | ,, | చ్చి . . తి . –వో ... | ‖ |
| 4 | సరి* | ,, | ,, | పధసాధాపా–సధధప-పగగరి | ‖ |
| | ..* | ,, | ,, | చ్చి . . తి . –వో...–. . . . | ‖ |
| | రీ* | గాప– ధ సస–సారిస–ధాసధ– | గాప ధ సస– | సరిగారీసా –ధపగరి | ‖ |
| | .* | నా .–. . . –నా..– . . . | . . . – | నా. . . . –ధ | ‖ |
| | సరి* | | | | |
| | ..* | (నన్ను) | | | |



అ. ;* పగాపధా - సాసధసా; | ; * పగాపధా | సా- సారిస - ధాసధ - పా ||
;* వ న జ న - య. . న; | ; * వ న జ న | య- న . - . . . - . ||

3 ;* పగాపధా - సాసారీ - సరిగారీ | ; *పగాపధా | సారీ - గారీ - గపగా ||
;* వ న జ న - య న . - . . . . | ; *వ న జన | యన - మో. - . . . ||

5 రీ* పగాపధా - సారీ - గారీ సరిగప | గరి-గ స-రి ధ-సప | ధరిసధ-ధపధా ||
.* వ న జ న - యన - మో. . . . . | . .-మును-జూ.-. . | చు. . . - . . కే ||

6 ;* ,, | గరి-రి స సరిగరిసా;| ధరిసధ - ధపధా ||
;* ,, | . .-మునుజూ. . . .;| చు. . . - . . కే ||

1 గా* గగాగగా - గపగరి - గాసా- | గాగగా-గగా | గపగరి - గాపధసా ||
జీ* వ న మ ని - నె.న. - రు న- | జీ వ న-మ ని | నె.న. - రువ . . ||

3 గా* గగాగగా - గపగరి - గాపధ | ధస - సధాస ధప | పధసాధాసా - ధపసధధప ||
జీ* వ న మ ని - నె.న. - రు న . | . . - మ నసుమ . | ర్మ. . ము . - దెలిసి . . . ||

పగగరి*
. . . .* (నన్ను)

చ. ;* ధ ధగా – ; గాగపధపగప | గరి–గధపా–గరీ– | స స – రిగరిగపా ||
;* సురప తి – నీ . . . . . . . | ల . –మ. ణి–నిభ– | త నువు – . . . . . ||

గరీస* గ పాధ సా–సారిస–ధాసధ– ధప–గప| గ రి – సధాసరీ | గా ధపపాగ రీ, ||

తో..* యురమ ము న–ము ..– . . .– . . .–. .| త్యపు– సకులచ | యము . . తో.,  ||

1 సా* పగాపధా – సాధా – సా; | ; * పగాపధా | సా– సారిస–ధాసధ పా ||
.* క రము న – శ ర – కో; | ; * క రము న | శ – ర . .– . . . కో ||

3 ;* పగాపధా – సాధా–సారీసరిగా | రీ * పగాపధా | సాధాసారీ – సరిగప ||
;* క రము న – శ ర –కో. . . .. | . * క రము న | శ ర కో . – . . . . ||

5 గరి* పగాపధా – సారీ –గార సరిగప | గరి–రిససరిగరిసా; | ధ రిసధ – ధపధా ||
..* కర ము న – శ ర –కో. . . .. | . .–దం . . . . డ; | కాం. . – తి . తో ||

;* గగాగగా – గప గరి – గపపధ – | ధస – ధసాధపా | పధ –ధప సధధప ||
;* ధ రణి త – న . య. – తో. . .– | . . –త్యా . గరా | జ. . . . . –ర్చి. త . . . ||
పగగరి*
. . . .* (నన్ను)

(b) A. B. అను వారు వెళ్లిన మొదటి మంటప విద్వాంసులశృతి పంచమ స్వరమైనందునA. అనువాడు వెళ్లిన రెండవ మంటప విద్వాంసుల శృతి, మొదటి మంటప విద్వాంసుల శృతికంటె ఒక పూర్ణస్వర మధికముగా నుండుటచే పంచమము + ఒకపూర్ణస్వరము = చతుశ్శృతి దైవతమగును. B. అనువాడు వెళ్లిన మూడవ మంటప విద్వాంసులశృతి, మొదటి మంటప విద్వాంసుల శృతి కంటె ఒకటిన్నర స్వరమధికముగా నుండుటచే పంచమము + ఒకటిన్నరస్వరము = కైశికీనిషాదమగును.

| | | | |
|---|---|---|---|
| మొదటి | మంటప | విద్వాంసుల శృతి | పంచమస్వరమైన |
| రెండవ | ,, | ,, | చతుశ్శృతి దైవతముగను |
| మూడవ | ,, | ,, | కైశికీనిషాదముగను |
| | | | యుండును. |

# Government Technical Examinatons.

## November 1933.

## Indian Music (Theory)–Higher Grade.

### ప్ర శ్న లు.

1. ధన్యాసి, కేదారగౌళ, నీలాంబరి, పూర్వకల్యాణి. యీ రాగముల యొక్క లక్షణములను వ్రాయుము.

2.(a) షడ్జ - చ.రి - అం.గా - ప్ర.మ - పం-శు.ధై - కై.ని. యీస్వరములుగల మేళకర్తను, దానిసంఖ్యను దెలుపుము.

(b) 12, 34, 55 యీసంఖ్యలుగల మేళకర్తలను, వాని యొక్క స్వరములను తెలియజేయుము.

3. ఈక్రిందివాటిని గురించి వివరించుము.
(i) ప్రత్యాహతము (ii) ధైవతాంత్యరాగము (iii) స్వరసాహిత్యము (iv) ఉపపల్లవి (v) ఘనరాగము.

4.(a) చాపుతాళమునకు త్రిపుటతాళమునకు గల భేదమును వ్రాయుము.

(b) (35) ముప్పదియైదు తాళములలో ఆవర్తము ఒకటికి 12 అక్షరములు వచ్చునట్టి మూడు తాళములను దెలుపుము.

5.(a) పదముయొక్క లక్షణమును వ్రాయుము.

(b) అరవపదములను తెలుగుపదములను రచించిన వాగ్గే యకారకుల పేర్లను వ్రాయుము.

6.(a) (i) గీతగోవిందము (ii) కృష్ణలీలాతరంగిణి (iii)రాగ విబోధము (iv) చతుర్దండి ప్రకాశిక. వీటిని రచించిన వారి పేర్లను వ్రాయుము.

(b) ముద్దుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రులు వీరి చరిత్ర లను, వీరు రచించిన కృతులను గురించి వ్రాయుము.

7.(a) గాలి వాద్యముల విభాగములను వ్రాయుము.

(b) తంబురవాద్యమును గురించి పటసహితముగా నొక వ్యాసము వ్రాయుచు, జీవాళియొక్క ప్రయోజనము నుగురించి వ్రాయుము.

8.(a) ఈక్రింద వ్రాయబడిన ప్రయోగములు ఆయారాగ ములలో రావచ్చునా? బిలహరిలో - రిగమగగరిరిస.

సారంగలో- సధాపమ. కల్యాణిలో . నిధమగరి.

(b) సహానా, ముఖారి, బేగడ రాగములలోయేదైన నొక రాగములో మీరు నేర్చుకొనిన కృతియొక్క చరణ మును,స్వర సాహిత్య, తాళాంగములతో వ్రాయుము.

## జవాబులు.

**1.** (i) ధన్యాసి రాగలక్షణము:—ఇది 44వ, పుటయందు గల 1931వ, సంవత్సరములోని 5వ, ప్రశ్నలో 1వ, జవాబునందు వ్రాయబడుట గమనించునది.

(ii) కేదారగౌళ రాగలక్షణము:—ఇది 45వ, పుటయందు గల 1931వ, సంవత్సరములోని 5వ, ప్రశ్నలో 2వ, జవాబునందు వ్రాయబడుట గమనించునది.

(iii) నీలాంబరి రాగలక్షణము:—ఇది 29వ, మేళకర్తయగు ధీరశంకరాభరణ రాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:—స రి² గ³ మ¹ ప ధ² ప ని³ స.

అవరోహణము:—స ని³ ప మ గ³ రి² గ³ స.

భాషాంగరాగము. వక్ర సంపూర్ణ, వక్ర షాడవరాగము. రక్తిరాగము. షడ్జగ్రహము. సాయంకాలము గానము సేయదగును. ఈ రాగమునకు మధ్యమము మిగులరంజనము గలిగించు జీవస్వరముగా నున్నది. ఈ రాగమున వచ్చు, ప ని² ధ ని² పా, ప ధ ని² పా అను సంచారములందు కైశికీ నిషాదము ప్రయోగింపబడును. అన్యస్వరమైన యీ కైశికీ నిషాద ప్రయోగమువలననే యిది భాషాంగరాగమగుచున్నది. ఈ రాగమున మంద్రస్థాయి నిషాదమునకు క్రింద సంచారములులేవు.

ఇందు గల ముఖ్యసంచారములు.

సరిగమపధపనిసాసా-సరిసనిపా-మగరిగమపామా-గమపనిపసా

సరిసనిపామా-గమపని$^2$ధని$^2$-పధని$^2$పామగసా-సానిధనిసానిపా

మగ - రిగమపమగ - రిగమగరిమగ - రిగసా - రిసనినీసా.

మొదలగునవి.

(iv) పూర్వకల్యాణి రాగలక్షణము:— ఇది 53వ, మేళకర్తయగు గమనశ్రమ రాగమున జనించిన జన్యరాగమై యున్నది. దీనినే పూరికల్యాణి అనియు చెప్పబడును.

ఆరోహణము:- { స రి$^1$ గ$^3$ మ$^2$ ప ధ$^2$ ని$^3$ ధ$^2$ స.
స రి$^1$ గ$^3$ మ$^2$ ప ధ$^2$ సి$^3$ ప ధ$^2$ ప స

అవరోహణము:—స ని$^3$ ధ$^2$ ప మ$^2$ గ$^3$ రి$^1$ స.

ఉపాంగరాగము. వక్రసంపూర్ణము. షడ్జగ్రహము. రక్తిరాగము. ఎల్లప్పుడును గానము సేయదగును. ఈ రాగమునకు గాంధారము మిగులరంజనము గలిగించు జీవస్వరముగా నున్నది. ఈ రాగమున ఆరోహణ, అవరోహణములందుగల కొన్ని సంచారములలో పంచమమును వర్జించి పాడుటయే సంప్రదాయమును రంజకమునై యున్నది.

ఇందు గల ముఖ్యసంచారములు.

సధపసాసా-ససరిసా-సనిధా-సరిగరిగా-గమపమగమగా-రిసా-

సరిగరిసా - సనిధమధసా - నిధని-మధనిధమగరిగసా- రిగమపా-

పధనిధసా-నిధమ-గనిధమ-గమధ-గమరీసా- సాసనిధాసా.
మొదలగునవి.

**2.** (a) షడ్జము, చతుశ్శ్రుతిరిషభము, అంతరగాంధారము, ప్రతిమధ్యమము, పంచమము, శుద్ధదైవతము, కైశికీనిషాదము. ఈస్వరములుగల మేళకర్త పేరు ఏమనగా? రిషభప్రియ. ఈమేళకర్తయొక్క సంఖ్య 62.

(b) 12, 34, 55 ఈసంఖ్యలుగల మేళకర్తలయొక్క స్వరము లేవనగా?

| మేళకర్త సంఖ్యలు. | మేళకర్తల పేర్లు. | మేళకర్తల స్వరముల వివరము. |
|---|---|---|
| 12 | రూపవతి | స $రి^1$ $గ^2$ $మ^1$ప$ధ^3$$ని^3$స |
| 34 | వాగధీశ్వరి | స$రి^3$$గ^3$$మ^1$ప$ధ^2$$ని^2$స |
| 55 | శ్యామలాంగి | స$రి^2$$గ^2$$మ^2$ప$ధ^1$$ని^1$స |

పైజూపిన విధమున ఆరోహణమునందుగల స్వరములే అవరోహణమున నుండును. ఆయా స్వరముల సంఖ్యలను బట్టి వాని పేర్లను ఈ పొత్తమునగల గురుతులపట్టికవలన గ్రహింపదగును.

**3.** (i) ప్రత్యాహతము:— అనగా అవరోహణజంట స్వరములలో రెండవ స్వరమును కొట్టి దానిమీదిస్వరముయొక్క ఛాయను రప్పించుట. ఉదా:-"సస" అనుదానిని "సరిస" అగునట్లు వాద్యమునందు పలికించుట ప్రత్యాహతమనబడును.

(ii) ధైవతాంత్యరాగము:—అనగా ఒక రాగములోని మిక్కిలి హెచ్చయిన స్వరము మధ్యస్థాయియొక్క ధైవతస్వరము (ధ)గా నున్నప్పుడు అట్టిరాగమును ధైవతాంత్యరాగమనబడును. ఉదా:- కురంజి. ఇది 29వ, మేళజన్యము. సనిసరిగమపధ-ధపమగరిసనిస ఈవిధముగా నుండును.

(iii) స్వరసాహిత్యము:—అనగా కొన్ని కృతులలో చిట్టస్వరములుండి వానిక్రింద సాహిత్యముగూడ నేర్పరచియుండును. ఇట్టి సాహిత్యముగల చిట్టస్వరములను స్వరసాహిత్యములందురు. వీనిని అనుపల్లవి చివరను, ప్రతిచరణము చివరను చిట్టస్వరమువలెనే పాడుదురు. ఈస్వరసాహిత్యముయొక్క మాతువు (సాహిత్యము) అనుపల్లవ చరణములయొక్క మాతువుననుసరించియే రచింపబడియుండును. ఉదా:- వాచామగోచర.అఠాణారాగము. మైసూరు సదాశివరావు విరచితము. మరియు సుబ్బరాయశాస్త్రి కృతులలో ననేకము ఇట్టిస్వరసాహిత్యముల కుదాహరణములుగా నున్నవి.

(iv) ఉపపల్లవి:—అనగా వర్ణములో రెండు పల్లవులుండును. అందు మొట్టమొదటిది సహజముగా అందరిచే చెప్పబడుచున్న పల్లవి. రెండవది వర్ణములోప్రతిమెత్తుగడ(చిట్ట)

స్వరముపాడిన వెంటనే మరల చరణమును పాడుదురు. గనుక అనుపల్లవ, ముక్తాయిస్వరములు పాడిన వెంటనే పల్లవి యెత్తుకొనునట్లు ప్రతి యెత్తుగడ స్వరము పాడినవెంటనే యెత్తుకొను వర్ణముయొక్క చరణమునే ఉపపల్లవని చెప్పబడును.

(v) ఘనరాగము:—అనగా ఇది ఘనమైన నాభితానముగా గానక్రియలను జేయదగినదియై శౌర్యవీరోత్సాహములుగల పురుషునిబోలియుండును. అనగా గంభీరమును ఠీవియు గలిగినట్లుండును. ఉ;- (1) నాట (2) గౌళ (3) వరాళి (4) ఆరభి (5) శ్రీరాగము మొదలగునవి. ఈ అయిదింటిని ఘనరాగపంచకమని జెప్పబడును.

**4.** (a) చాపుతాళమునకు త్రిపుట తాళమునకు గల భేదమేమనగా? ఈప్రశ్నోత్తరమును 9, 10వ, పుట లందుగల 1930 వ,సంవత్సరములోని 4వ, ప్రశ్నలో, బి, జవాబునందు వ్రాయబడుట గమనించునది.

(b) (35) ముప్పదియైదు తాళములలో ఆవర్తము ఒకటికి 12 అక్షరములు వచ్చునట్టి 3 తాళములు ఏవనగా?

| తాళములపేర్లు. | అంగసంజ్ఞలు. | అక్షరవివరము. | అక్షరసంఖ్య |
|---|---|---|---|
| (i) చతురశ్రజాతిఅట | $_4\ _4$ 0 0 | ...4+4+2+2 | = 12 |
| (ii) ఖండజాతిమఠ్య | $_5$ 0 $_5$ | ...5+2+5 | = 12 |
| (iii) సంకీర్ణజాతిఝంప | $_9$ ◡ 0 | ...9+1+2 | = 12 |

**5.** (a) పదముయొక్క లక్షణమేమనగా? ఇది 18వ,

పుటయందుగల 1930వ, సంవత్సరములోని6వ, ప్రశ్నలో 3వ, జవాబునందు వ్రాయబడుట గమనించునది.

(b) అరవపదములను తెలుగుపదములు రచించిన వాగ్గేయ కారకులెవరనగా?

అరవపదములు రచించిన వాగ్గేయకారకులు.

(i) వైదీశ్వరుని గుడి సుబ్బరామయ్యర్
(ii) ఘనం కృష్ణయ్యర్
(iii) శంకరాభరణము నరసయ్యర్
(iv) పాపవినాశ మొదలియారు
(v) ముత్తుతాండవరు మొదలగువారు

తెలుగుపదములు రచించిన వాగ్గేయకారకులు.

(i) క్షేత్రజ్ఞులు
(ii) ఘనం సీనయ్య
(iii) పరిమళ రంగుడు
(iv) సారంగపాణి
(v) మువ్వలూరి సభాపతిఅయ్యర్
(vi) మెరటూరు వెంకటరామశాస్త్రి
(vii) కార్వేటినగర్ గోవిందస్వామయ్య మొదలగు వారు.

**6.** (a) ప్రబంధములు. రచయితలు.

(i) గీతగోవిందము రచించినది...జయదేవకవి
(ii) కృష్ణలీలాతరంగిణి రచించినది...నారాయణతీర్థులు
(iii) రాగవిబోధము రచించినది...సోమనాథపండితుడు.
(iv) చతుర్దండిప్రకాశిక రచించినది... వెంకటమఖి

## (b) ముద్దుస్వామి దీక్షిత చరిత్రము.

(i) సంగీత త్రిమూర్తులలో రెండవ వారైన ముద్దుస్వామి దీక్షితులు 1775వ, సంవత్సరములో తిరువారూరు నందు జన్మించెను. ఇతడు హంసధ్వని రాగమును సృజించిన శ్రీ రామస్వామి దీక్షితారుని కుమారుడు. వెంకటమఖి, గోవిందదీక్షితుల సంతతిలోనివాడు. ఇతడు శ్యామశాస్త్రి వద్ద శ్రీ విద్యా మంత్రోపదేశము నొందెను. ఇతడు సకల విద్యాపారంగతుడై వివాహమాడిన తదుపరి కళాప్రియుడగు చిన్నయ్య మొదలియారువుండు మణలి (Manali)కి వెళ్ళెను. అచ్చటికివచ్చిన చిదంబరనాథయోగిని కలసి కాశీకి వెళ్ళెను. అచ్చట అయిదు సంవత్సరములుండి సంగీతవిద్యయందు గొప్ప ప్రజ్ఞను సంపాదించుటయేగాక హిందూస్థానీ సంగీతముగూడ నేర్చెను. తిరిగివచ్చునపుడు తిరుత్తణియందుగల సుబ్రహ్మణ్యేశ్వరుని సన్నిధియందు పంచాక్షరీమంత్రము జపించుచుండునపుడు స్వామివారీతనికి ప్రత్యక్షమై నోటిలో కండచక్కెర ముక్కను వేసి యదృశ్యుడయ్యెను. దైవానుగ్రహముచే అప్పటినుండియు "గురుగుహ" ముద్రతో కృతులు వ్రాయుట ప్రారంభించి నవగ్రహకృతులు, పంచలింగస్థలకృతులు, అపూర్వ రాగములలో తానవర్ణములు, రాగమాలికలు, లక్షణ గీతములు వ్రాసెను. ఈతని సోదరులగు చిన్నస్వామి, బాలస్వామిదీక్షితులు మధుర గానసభవారి ఆహ్వానముపై మధురకువెళ్లి అన్నగారి కృతులను గానముచేసి మెప్పొవడసిరి. తదుపరి చిన్నస్వామి యచటనే మరణించగా బాలస్వామి చింతాక్రాంతుడై విరక్తిచే సేతుయాత్రకు వెడలి తిరిగివచ్చునపుడు

మార్గమధ్యమున యెట్టయపురము జేరి రాజుచే యాదరింపబడి యుండెను. చిన్నస్వామి మరణము వినగనే ముద్దుస్వామిదీక్షితులు విరక్తుడై యున్న బాలస్వామిని వెదకుచు ఎట్టయపురమునకువచ్చి పెండ్లికొడుకై యున్న తనతమ్ముని కలుసుకొనగలిగినందుకు మిగుల సంతసించెను. తరువాత కొన్నాళ్లకు తిరిగి తిరువారూరు వెళ్లియుండునప్పుడు 1835 సంllలో యెట్టయపురం రాజపుత్రుని వివాహమునకై పంపిన ఆహ్వానముపై యెట్టయపురము వెళ్లి వివాహము జరిగిన మూడవనెలలో మన్మథసంవత్సర తుల కృష్ణచతుర్థినాడు దివంగతుడయ్యెను.

ముద్దుస్వామిదీక్షితులవారి శిష్యులలో ముఖ్యులు.

(1) తిరుక్కాడయూరుభారతి (2) అవదయర్ కోవిల్ వీణ వెంకటరామయ్య (3) తేవూరుసుబ్రహ్మణ్యయ్య (4) కొర్నాడు రామస్వామి (5) బిల్వవనం (6) అయ్యాస్వామి (7) శుద్ధమృదంగం తంబియప్ప (8) వడివేలు (9) పొన్నయ్య (10)చిన్నయ్య(వీరుముగ్గురుసోదరులు) (11)తిరువాలూరుకమలం (12) అమ్మణ్ణి మొదలగువారు.

దీక్షితులవారు 300 కృతులవరకు రచించినటుల తెలియుచున్నది. వీనిలో ఎక్కువగా సంస్కృతమున వ్రాసెను.సంగీతసాహిత్యజ్ఞానము గలవారు మాత్రమే వీరికృతులనుగ్రహించియానందింపగలరు. ఈకృతులు కఠినశైలిగను పెద్దవిగానుండి నారికేళపాకముగానుండును. కర్నాటకసంగీతమునకు వీరిసంగీతరచనలెంతో ప్రాముఖ్యమైయున్నవి.



శ్రీ ముద్దుస్వామి దీక్షితులు (1775—1835)

## శ్యామశాస్త్రుల చరిత్రము.

(ii) సంగీత త్రిమూర్తులలో మూడవవారైన శ్యామశాస్త్రిలు తంజావూరుజిల్లా తిరువారూరు (శ్రీనగర్)లో 1763 చిత్రభానునామ సంవత్సర మేషరవికృత్తికానక్షత్రమున జన్మించెను. ఇతడు గౌతమ గోత్రీయుడు. బోధాయన సూత్రము. తండ్రి విశ్వనాథఅయ్యర్. ఈశ్యాముని పుట్టుకకుముందు ఒక భక్తునికి శ్రీవేంకటాచలపతి ఆవేసించి శ్యాముని తల్లిని పిలచి రాబోవు చైత్రమాస కృత్తికానక్షత్ర, శనివారమున నీకొక కుమారుడు కలుగును. కనీసము 25మందికి సమారాధనచేయుమనిచెప్పెను. ఆమెఅట్లేచేయ,గడువుదినముననే శ్యామశాస్త్రి జన్మించెను. ఇతనికి మొదట వెంకటసుబ్రహ్మణ్యుని పేరిడిరి. కాని ముద్దునకు శ్యామకృష్ణయనిపిలుచుచుండిరి. బాల్యముననే సంస్కృతాంధ్రముల నభ్యసించుటయేగాక మేనమామనొద్దకొలదిగ సంగీతవిద్యనభ్యసించి 18వయేట తల్లిదండ్రులతోపాటు తంజావూరు వచ్చెను. కాశీనుండియాత్రార్థియైవచ్చిన ఆంధ్రబ్రాహ్మణుడగు సంగీతస్వామి,శ్యాముని యింటికిబిక్షకై పిలువబడివచ్చినపుడు శ్యామశాస్త్రియొక్క భవిష్యత్తునుచెప్పుటయేగాక అపూర్వరాగ, తాళప్రస్థారక్రమములను దెలిపి "గంధర్వగ్రంథముల"ను ప్రసాదించెను. తాను వెడలిపోవునపుడు శ్యామశాస్త్రిని పిలిచి నాయనా? శ్యామా!సంగీత శాస్త్రమందపార పాండిత్యము సంపాదించితివి. తంజావూరు సంస్థానగాయకుడగు పచ్చిమిరియం ఆది అప్పయ్యగారి సంగీతమును తెలుచుగా వినుచుండుము. గాని వారివద్దనేమియు నభ్యసింపవలదని

చెప్పి కాశీకి వెళ్ళెను. శ్యామశాస్త్రియటులేచేసి ఆదిఅప్పయ్య గారి ప్రేమకు పాత్రుడయ్యెను. శ్యామశాస్త్రి శ్రీకామాక్షి యొక్క సాక్షాత్కారమునొందిన మహాపురుషుడగుటచే"శ్యామకృష్ణ"ముద్రతో బహుకృతులు, తానవర్ణములు, స్వరజతులు, నవరత్నమాలికలు రచించి సాటిలేని గాయకుడని పేరు పొందెను. ఈతడు తెల్లని దుస్తులు, గంధాక్షతలు, బంగారు పొదిగిన రుద్రాక్షమాల, రవ్వలకమ్మలు, పండితశాలువ ధరించి యున్నపుడు సురద్రూపిగా వెలయుచుండెడివాడు. ఈతడు కృతులనేగాకమాంజి, కలగడ, చింతామణి, యిత్యాది అపూర్వరాగములను గూడ కల్పించెను. ఇతడు ఎక్కువమంది శిష్యులను చేరదీయక పోవుటచేతను, వారికైనను తనకృతులనన్నిటి నిబోధింపకపోవుటచేతను వీరికృతులన్నియు ప్రచారములోలేవు. ఇతడు నరస్తుతికి పొంగెడివాడుకాడు. త్యాగయ్యగారికి పరమమిత్రుడగుటచే వీరిరువురును తమగచనలనువిమర్శించి సరిచూచుకొనెడివారు. వీరిభార్యవీరికంటె 5 రోజులు ముందుగ నేస్వర్గస్థురాలయ్యెను. వెంటనే శ్యామశాస్త్రి నాకె క 5 రోజులే ఆయువుగలదని అందరితో చెప్పి సరిగా 6వ దినముననే అనగా 1827 వ్యయసంవత్సర మకరమాస శుక్లదశమినాడు తన 64వ యేట తంజావూరిగాయకశిఖామణి స్వర్గస్థుడయ్యెను.

శ్యామశాస్త్రి శిష్యులలోముఖ్యులు—(1) సుబ్బరాయ శాస్త్రి (కుమారుడు) (2) పోరంబూరుకృష్ణయ్య (3) అలసూరు కృష్ణయ్య (4) సంగీతస్వామి (5) దాసరి మొదలగువారు. శ్యామశాస్త్రిలు 300 కృతులవరకురచించెను. ఇవి సామాన్య



శ్రీ శ్యామశాస్త్రులు (1763—1827)

లు ఆనందించలేనంత క్లిష్టముగానుండి కదళీపాకముగానుండుట చే గాయకత్రయములో వీరికృతులేతక్కువప్రచారములోనున్నవి. దేశీస్థనమే వీటిభావము. కర్నాటకసంగీతమున వీరికృతులెంతో ప్రాముఖ్యముగా నేటికిని వాడబడుచున్నవి.

**7**. (a) గాలివాద్యములు యీదిగువ దెలిపినటుల మూడువిధములుగా విభజింపబడుచున్నవి. ఎటులనగా?

(i) ఒకయంత్రసహాయమున గాలినుత్పత్తి జేసివాయింపబడువాద్యములు. అనగా తిత్తులసహాయముతో వాయింపబడునవి. ఉ॥ ఆర్గన్, హార్మోనియము మొదలగునవి.

(ii) వేళ్ళు అనుకొనేందుకు రంధ్రములుగలిగియుండి గాయకుని ఊపిరివలన గాలినిసంపాదించుకొను వాద్యములు. వీటిని తిరిగి రెండువిధములుగ విభజింపబడుచున్నవి.

1 ధ్వనినిచ్చు రెండుపాయలుగల నాలుకలనుగాని లేక తదితర సాధనములనుగాని నోటిలోనుంచుకొనిగాలినూదుచు వాయింపబడువాద్యములు ఉ॥దక్షిణ దేశపు నాగస్వరము, ముఖవీణ, సన్నాయి మొదలగునవి.

2 రంధ్రములగుండ గాలినిచొప్పించి వాయింపబడు వాద్యములు ఉ॥ పిల్లనగ్రోవి (Flute) మొదలగునవి.

(iii) వేళ్ళుఅనుకునే రంధ్రములు లేకను, గాయకునిఊపిరి సహాయమున పేక్షింపకను వాయింపబడు వాద్యములు ఉ॥ గౌరీకాలమ్, తిరుచిన్నమ్, ఎక్కాలమ్కొంబు, రీడ్ డుల్సిమరు, శంఖము మొదలగునవి.

పై విషయములే గాలివాద్యవిభాగముల గురించినవివరము.

## (b) తంబుర వాద్యమును గురించి వ్యాసము.



ఇయ్యది తంత్రీవాద్యములలో చేరినది. వీణావాద్యమువలెనేనిదియు, అనాదినుండియువాడబడుచు గాత్రగానము నందును తదితర జంత్రగానములందును శృతికై నుపయోగింపబడుటచే నిది శృతివాద్యమని చెప్పబడుచున్నది. పూర్వీకులలో కొందరు రెండేసి తంబురలను గూడనొకే సమయమున శృతికై వుపయోగించుచుండినటుల దెలియుచున్నది. తంబురను శృతిచేసి మీటుట సహజముగా కష్టసాధ్యమగుటచే యిటీవల కొందరు హార్మోనియమును గూడ శృతికై నుపయోగించుచున్నను తంబురశృతియందలి ధ్వనిమాధుర్యము నుజీవము గుర్తెరింగినసంగీతజ్ఞులీనాటికిని తంబురనేశృతికై వాడుచున్నారు. ఇట్టి తంబురలను తంత్రులుగల డ్రోన్స్ అందురు. డ్రోన్ అనగా శృతిని ధ్వనింపజేయుట కుపయోగింపబడు వాద్యము. వీనివివరములు.

(i) తంత్రులసంఖ్య:-తంబురకు ముఖ్యముగా 4 తంత్రులు వుండును. పూర్వీకులగు షట్కాల గోవిందమారార్ వారి తంబురకు 7 తంత్రులుగలవనియు అవి 3 మంద్రపంచమములు, 3 మధ్యషడ్జములు, 1 మంద్రషడ్జముగా నుండెననియు చెప్పుదురు. గాని యిప్పుడట్టి తంబురలు వాడుకలోలేవు.

(ii) తంత్రుల వివరము:—1 మంద్రపంచమతంతి 2 మధ్యషడ్జతంతి 3 మధ్యషడ్జతంతి 4 మంద్రషడ్జతంతి.

(iii) తంత్రుల రకములు:—1, 2, 3 తంత్రులు ఉక్కు తంత్రులుగా నుండును. 4వ, తంతి ఇత్తడి లేక వెండి తంతిగా నుండును.

(iv) తంత్రులను వేయువిధము:-తంబురకుగల 4 తంత్రులను ఒకవైపు మూలాధారము వద్దముడి వేసి రెండవవైపు కుండమీదసమర్చబడిన పీట(బ్రిడ్జి)మీదుగాతంబురచివరనుండు బిరడాలకుచుట్టి శృతిచేయవలెను.

(v) తంత్రులను శృతిచేయువిధము:—మొదటి తంతిని మంద్రపంచమముగను రెండవ, మూడవతంత్రులను మధ్యషడ్జములుగను నాల్గవతంతిని మంద్రషడ్జముగను శృతిచేయవలెను. అట్లు చేయునపుడు గాత్రధర్మము ననుసరించి, తంత్రులబలమునకు తగినట్లు హార్మోనియమునందుగల 1 శృతి మొదలు 5 లేక 5½ లేక 6 శృతివరకు శృతిచేయదగును.

(vi) వేళ్లనుపయోగించు విధము:—కుడిచేతి వేళ్లలో మధ్యమ వేలుతో 1వ మంద్రపంచమతంతిని, చూపుడు వేలుతో 2, 3 మధ్యషడ్జతంత్రులను, 4వ మంద్రషడ్జమును మీటుచు శృతి వేయవలెను.

జీవాళినుపయోగించుట వలన ప్రయోజనమేనగా:—తంబురయొక్క కుండమీద తంత్రులను యెత్తుగానుంచుటకు

ఏర్పరచినపీట(బ్రిడ్జి)మీందిభాగముననుండు తంత్రులకును పీటకు మధ్యగా కొంచెమువ్రూలుదారము(Wool)గాని లేక కంబళిదారముగానియుంచి ముందువెనుకకులాగుచు తంతినిమీటిన అందు జీవముగల ధ్వని బయలుదేరును. అనగా ఆతంతియొక్క స్వయంభూస్వరములు నియతస్థానమునకువచ్చి ఆధారశృతిలో జేరును. ఇటులనే మిగత తంత్రులన్నిటికిని జీవాళినుపయోగించి జీవముగల ధ్వనిగల్గునటులచేసి శృతివేయునప్పుడు తంబుర శృతియందు మిక్కిలి గంభీరమును,జీవమునుగలిగి గాత్రగానమునకు మిక్కిలి అనుకూలముగాను రక్తిగానుండును. ఇదే జీవాళి నుపయోగించుట వలన కలుగు ప్రయోజనము.

**8.**(a) బిలహరి:—ఈరాగములో "రిగమగగరిరిస" అను ప్రయోగము రావచ్చును? కారణమేమనగా ఈరాగమునకు గలఆరోహణమునందు సరిగపధస, అను విధమున ఆరోహణమున మధ్యమము వర్జముగానున్నను అవరోహణమున సనిధపమగరిస, యగుటచే మధ్యమము కలదు. గనుక ప్రశ్న యందుగల "రిగ-మగగరిరిస"లో "రిగ" యనునది ఆరోహణప్రయోగమును వెంటనేయుండు "మగగరిరిస" అనునది అవరోహణప్రయోగమును యెంచదగునుగాననీప్రయోగము బిలహరిలో రావచ్చుననుటకు ఈ క్రింది ఉదాహరణమును గూడ గమనించునది.

వీణ కుప్పయ్యగారి బిలహరి వర్ణములో ముక్తాయిలో మూడవ ఆవర్తములో మొదటి ద్రుతమునందుగల ।సరిగమ

గగరిస। అనునది యిందులకు ముఖ్యోదాహరణము.

(ii) సారంగ:— ఈరాగమున "సధాపమ" అను ప్రయోగము రావచ్చును. ఎటులనగా? ఈరాగమునగల ఆరోహణ అవరోహణములందు "సరిగమపధనిస-సనిధపమరిగమరిస" యను విధమున నుండుటచే దీనిలో నిషాదము వర్జముగాక పోయినను ఈరాగముయొక్క విశేష ప్రయోగములందు "సధాపమ" యను ప్రయోగము గలదు. గనుక ప్రశ్నయందుగల "సధాపమ" యను ప్రయోగము సారంగలో రావచ్చును. సారంగ రాగ ఆదితాళ తానవర్ణములో పల్లవిలోని రెండవ ఆవర్తములో రెండవ ద్రుతమునందుగల ।సధాపమరి-గమ॥ అనునది యిందులకు ముఖ్యోదాహరణము.

(iii) కల్యాణి:-ఈరాగమునందు "నిధమగరి" ప్రయోగము రావచ్చును. ఇందుగల ఆరోహణావరోహణములు సంపూర్ణమైనను విశేష ప్రయోగములందు షడ్జ పంచమములు వర్జముగల సంచారములుండుటచే ప్రశ్నయందుగల "నిధమగరి" యను ప్రయోగము కల్యాణిరాగములో రావచ్చును. ఉ॥పల్లవి గోపాలయ్యగారి కల్యాణి అటతాట తానవర్ణములోని అనుపల్లవిలో రెండవలఘువునందుగల "నిధగమపగరిస-నిధమగరి-పమగరిసనిరి"। యనునది యిందులకు ముఖ్యోదాహరణము.

## (b) శ్రీ త్యాగరాజ విరచిత .
సహానా ౹ గము – ఆది ళము.

కృతి (గిరిపై నెలకొన్న రాముని)

చ॥ పులకాంకితుడై యానందాశ్రువుల – నింపుచు మాట్లాడవలెనని–
కలువరింపఁగని పదిపూటలపై – గాచెదనను త్యాగరాజవినుతుని॥

చ. ; * ప ప ; , రి – రిగమప – రిగమప ౹ పాధప మాగాగా ౹ రీగ రి సాసా ॥
; * పుల కాం, . – కి . . తు – డై . . . ౹ యా. . . నం . ౹ దా. . . శ్రు ॥
; * రి రి రీగరిసా –నీ నీ ధానిధపాధప ౹ మా– ధ నిసరి–గమ ౹ పమగామగరీగరిసా ॥
; * వు లనిం. . . –పు చుమా . . . . . ౹ . –ట్లా . . .–డ . ౹ వ. లె . . న . . ని ॥

1 ; * ప పధపమా –గాగా–రీగరిసా ౹ ;– ప ప మ ధ ధా ౹ ని స ని ధ పా; ॥
; * కలువ . రిం –ప గ–ని . . . ౹ ;– ప . ది పూ . ౹ ట . ల . పై; ॥

2 పమ * పపధప–మపధపమా–గాగారీగరిసా ౹ ; ప ప మ ధ ధా ౹ నీనీ ధానిధపాధప ॥
. . * కలువ.–రిం. . . . –ప గ–ని. . . ౹ ; ప . ది పూ . ౹ టలపై. . . . . ॥

3 పమ * ,, ౹ ,, ౹ నీసానిసరిగరిసనీధప ॥
. . * ,, ౹ ,, ౹ టలపై . . . . . . . ॥

4 పమ * ధనిసా–పధనిధ–మపధపమా; ॥ రీగరిసా; । ; ప ప మ ధ ధా। నీ; సా సా ॥
. . * క . లు–వ . . . –రిం. . . . ; ప గని. . . ;। ; ప . దిపూ . । టు; ల పై ॥

1 , * రి సా నీ నీ సా ధా – ని స ని ధ । ం పా–పాధపమా । గా గా రీ గ రి ॥
, * గా . చె ద న ను –త్యా. గ , । రా జ –వి . . . । ను . తు . . ॥

2 స * ,, । పాపా–ధనిసా । రిగమపధపమా–గామగరీగరి॥
ని * ,, । రా జ–వి . . . । ను. . . . . . –తు . . . . ॥

3 స * ,, । ం పా–రిగమపధనిసరి। నీ;ధపమా–గామగ-రీగరి ॥
ని * ,, । రా జ –వి. . . . . . । ను; . . –తు .– . . . ॥
సా *
ని * (గిరిపై)

N. B:—పై 8వ, (బి) ప్రశ్నలో సహానా, ముఖారి, బేగడరాగములలో యేదైన ఒక రాగములోని కృతియొక్క చరణమునుమాత్రమే స్వరసాహిత్యతాళాంగములతో వ్రాయ మనుటచే నదేవిధముగ నిందు వ్రాయబడినది. ఈసహానాలోని గిరిపైనెలకొన్న అను కృతియొక్క పల్లవ అనుపల్లవులు నా మొదటిగ్రంథమగు "గానకళాచంద్రిక" లో 153వ, పుట, యందు స్వరసాహిత్య తాళాంగములతో నుండుట గమనించునది.

# Government Technical Examinations.

## November 1934.

## Indian Music (Theory)–Higher Grade.

### ప్రశ్నలు.

**1.** ఈక్రింద వ్రాయబడియుండు రాగములలో యేరెంటికైనను లక్షణములను వ్రాయునది.

సావేరి, మోహన, సారంగ.

**2.** (a) (i) కైశికీ నిషాదము అన్యస్వరముగావచ్చు భాషాంగ రాగము,

(ii) ఆరోహణమును అవరోహణమును వక్రముగానుండు రాగము,

(iii) ఔడవ సంపూర్ణ రాగము,

(iv) దేశీయరాగము, వీటిలో ఒక్కొక్కదానికి రెండు ఉదాహరణములను తెలియజేయుడు.

(b) 72 మేళకర్తలుగల ప్రతిచక్రములోను ఉత్తరాంగ స్వరములు ఒకటే వరుసక్రమముగా వచ్చుచుండుటను గురించి వివరించి వ్రాయుడు.

**3**.(a) ఆవర్తము ఒకటికి 5 అక్షరకాలములుగల 3 తాళము లను తెలియజేయుడు.

(b) లయ, తాళము:- యీపదములయొక్క అర్థమును విశదముగ వ్రాయుడు.

**4**.(a) కృతియొక్క లక్షణమును వ్రాసి దానిని వాగ్గేయకారకులెట్లు అలంకరించియున్నారు అనే దానిని ఉదాహరణములతో వ్రాయుడు.

(b) ఈక్రిందివాటికి ఉదాహరణములు దెలుపుము.

(i) జతులుగల ప్రబంధము.

(ii) రెండుపల్లవులుగల ప్రబంధము.

(iii) అంగములు వేఱు వేఱు రాగములలోనుండు ప్రబంధము.
(ప్రబంధము=Musical Composition)

**5**. ఈక్రిందివాటినిగురించి సంక్షేపముగా వ్రాయుడు.
(i) అష్టపది (ii) జతిస్వరం (iii) పదవర్ణం (iv)పంచమాంత్యరాగము (v) ప్లుతం.

**6**.(a) త్యాగరాజస్వామి, ముద్దుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రిలు, వీరిని సంగీత త్రిమూర్తులని యెందుకు చెప్పెదరు? కారణములను వ్రాయుడు.

(b) గోపాలకృష్ణభారతిగారి "నందనార్ చరిత్రము"యొక్క విశేషమును గురించి ఒకవ్యాసము వ్రాయుడు.

**7.**(a) గోటువాద్యమునుగురించి పటసహితముగా నొకచిన్న వ్యాసము వ్రాయుడు.

(b) ఈక్రిందివాటికి ఉదాహరణములను వ్రాయుము.

(i) కమానుతో వాయించబడు మెట్లుగల తంతివాద్యము.

(ii) వ్రేళ్ళ,రంధ్రములులేనిగాలివాద్యము. కమాను=bow

**8.** ధన్యాసి, హరికాంభోజి, పూర్వకల్యాణి రాగములలో నేదైన ఒకరాగములో మీరు నేర్చుకొన్నకృతిని స్వర, సాహిత్య, తాళాంగములతో వ్రాయుడు.



## జవాబులు.

---

**1.** (i) సావేరి రాగలక్షణము:— ఇది 15వ, మేళకర్తయగు మాయామాళవగౌళ రాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:— స రి$^1$ మ$^1$ ప ధ$^1$ ṡ.

అవరోహణము:— ṡ ని$^3$ ధ$^1$ ప మ$^1$ గ$^3$ రి$^1$ స.

భాషాంగరాగము. ఔడవసంపూర్ణము. షడ్జగ్రహము. రక్తిరాగము. ఎల్లప్పుడును గానము సేయదగును. ఈరాగమునకు అంతర గాంధార, శుద్ధమధ్యమ, శుద్ధధైవతములు రాగచ్ఛాయాస్వరములుగానున్నవి. ఈరాగమునకుఅంతరగాంధార, కాకలీనిషాదములు నియతశ్రుతులుగానున్నను, ఆరోహణమునందు "సరిగా²" "పధనీ²" అనెడిప్రయోగములందు ఇవి ఒకశ్రుతి తక్కువగానే అనగా త్రిశ్రుతి (సాధారణ) గాంధార, త్రిశ్రుతి (కైశికి) నిషాదములుగా బలుకుచున్నవి. ఈరాగమున సరిమగా, పమగరిగమగా, మగరిస అను సంచారములందు అంతరగాంధారమును, ṡనిధప అను సంచారమునందు కాకలీనిషాదమును బలుకును.

ఇందుగల ముఖ్యసంచారములు.

సరిమపధసాసా–సరిసనిధా–పధసరిగా–రిగరిసా–సనిధరిసనిధా–

పామపధని²ధమగరిసా-సారీగా²రిగ²రీ-రిమపధమాగరి-మపధ

సానిధపమగరి-సరిపమగరిసా-సాసనిధపధరీసా మొదలగునవి.

(ii) మోహనరాగలక్షణము:—ఇది 28వ, మేళకర్త యగు హరికాంభోజిరాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము;— స రి² గ³ ప ధ² స.

అవరోహణము;— స ధ² ప గ³ రి² స.

ఉపాంగరాగము. ఔడవరాగము. గమకవరీకరాగము. షడ్జగ్రహము. ఎల్లప్పుడును గానము సేయదగును. ఈ రాగమున, ఆరోహణ, అవరోహణములందు మధ్యమ, నిషాదములు వర్జముగను, రిషభ, గాంధార, ధైవతములు రాగచ్ఛాయా స్వరములుగను యున్నవి. మధ్యమ, నిషాదములు రెండును వర్జమైన యీ రాగమును 28వ మేళకర్త జన్యమనుటకు గల కారణమేమనగా:- ఇందుగల అంతరగాంధారముచే శుద్ధమధ్యమమును, చతుశ్రుతి ధైవతముచే కైశికీనిషాదమును కొన్నిసమయములందు ఒదిగింపుతో అల్పముగా ధ్వనించును. గనుక దీనిని 28వమేళకర్త జన్యమనియే చెప్పుటకు కారణమైనది. ఈ రాగమున గగపపధధసస మొదలగు జంటస్వర ప్రయోగములును, ధగరిసధప-గధపగరిస మొదలగు దాటుస్వరప్రయోగములును ముఖ్యముగానున్నవి. ఇది మిక్కిలి ప్రాతనమైనరాగము.

ఇందుగల ముఖ్యసంచారములు.

గపధసాసా-సధరిసధా-పధసరిగా-గరిగపగారిసా-సరిగరిసా-స
ధధపధా-పగధపగరిసా - గపగధపగరిసా - రిసధసధాపా-పగప
ధసధసా మొదలగునవి.

**2.** (a) కైశికీనిషాదము అన్యస్వరముగా వచ్చు భాషాంగరాగములు ఏవనగా?

1 బిలహరిరాగము:—ఇందు "పధనిధ$^{2}$పా" అను సంచారమున కైశికీనిషాదము పలుకును.

2 నీలాంబరిరాగము:—ఇందు పని$^{2}$ధని$^{2}$పా అను సంచారమున కైశికీనిషాదము పలుకును.

(ii) ఆరోహణ, అవరోహణములందు వక్రముగానుండు రాగములు ఏవనగా?

1 సహానారాగము:—సరిగమపమధానిస - సనీధపమగా$^{2}$మరీగరిస. ఈవిధముగ నుండును.

2 కానడరాగము:— సరిగమపమధానిస-సనిపధనిధపమగామరిస. ఈవిధముగ నుండును.

(iii) ఔడవ సంపూర్ణరాగములు ఏవనగా?

1 కేదారగౌళరాగము:—సరిమపనిస - సనిధపమగరిస
5 7

2 ధన్యాసిరాగము:— సగమపనిస - సనిధపమగరిస
5 7

(iv) దేశీయరాగములు యేవనగా?

1 ఖమాసు
2 హిందూస్థానికాఫి } ఇవి ఉత్తరహిందూస్థానమునుండి తేబడిన వగుటచే దేశీయరాగములనబడుచున్నవి.

(b) 72 మేళకర్తలుగల 12చక్రములలో ప్రతిచక్రమునందును ఉత్తరాంగ స్వరములొకటే వరుసక్రమముగా వచ్చుటనుగురించిన వివరమేమనగా?

ఈగ్రంథమునగల 5, 6, 7 పుటలందు జెప్పబడియున్న వెంకటమఖివారి మేళకర్తరాగపద్ధతి ననుసరించి యేర్పడిన పూర్వ, ఉత్తరమేళములగు 72 మేళకర్తరాగములును 12 చక్రములుగా విభజింపబడుటచే ఒక్కొక్క చక్రమునందుగల 6 మేళకర్తరాగములును, వానికిగల పూర్వాంగ (సరిగమ) ఉత్తరాంగ (పధని)స్వరములలో ఉత్తరాంగస్వరములను యీక్రింది వరుసక్రమముగా తీసుకొనుట గమనించునది.

| ప్రతి | | మేళకర్త | | |
|---|---|---|---|---|
| చక్రములో | 1,2,3తరగతుల | రాగములు | శుద్ధ | ధైవతమును |
| ,, | 4,5తరగతుల | ,, | చతుశ్శృతి | ,, |
| ,, | 6వ తరగతి | రాగము | షట్ఛృతి | ,, |
| ,, | 1వ తరగతి | ,, | శుద్ధ | నిషాదమును |
| ,, | 2,4తరగతుల | రాగములు | కైశికీ | ,, |
| ,, | 3,5,6తరగతుల | ,, | కాకలీ | ,, |

తీసుకొనుచున్నవి. గనుక, 72 మేళకర్తలుగల 12 చక్రములలో ఒక్కొక్కచక్రమునందు పైవిధముగా ఉత్తరాంగ స్వరములు వచ్చుటచే, ప్రతిచక్రములోను ఉత్తరాంగ స్వరములొకటే వరుసక్రమముగా వచ్చుచున్నవని చెప్పుటకు కారణమైనది. ఇదే ఉత్తరాంగస్వరములు వరుసక్రమముగా వచ్చుటగురించిన ముఖ్య వివరము.

**3.** (a) ఆవర్తము ఒకటికి 5 అక్షరకాలములుగల 3 తాళములు ఏవనగా:

| తాళములు. | అంగసంజ్ఞలు | | అక్షరవివరము | | అక్షరసంఖ్య |
|---|---|---|---|---|---|
| 1 తిశ్రజాతిరూపకం | $0\,|_3$ | ... | 2+3 | = | 5 |
| 2 ఖండజాతిఏక | $|_5$ | .. | 5 | = | 5 |
| 3 ఖండచాపు | $\cup_2 \cup_3$ | ... | 2+3 | = | 5 |

(b) (i) లయ:—అనగా గానముతో జేరి తాళము హెచ్చుతగ్గులేక నడచునట్టి సంగీతకాలము లయ అనిచెప్పబడును. లయ=ప్రాణము

(ii) తాళము:—అనగా సంగీతకాలమును తెలిసికొనుటకు నుపయోగించుకొలతకు తాళమనిచెప్పబడును. ఎటులనగా? సంగీతమును గాత్రమునగాని జంత్రమునగాని ప్రదర్శించునపుడు ఆయాపాటలయొక్క కాలప్రమాణమును చేతితో వ్రేళ్లనుంచుటవలనగాని తాళయంత్రము నుపయోగింప నడికొట్టుటవలనగాని తెలుసుకొను కొలతకు తాళమని పేరు.

**4**. (a) కృతియొక్క లక్షణమును వ్రాసి వాగ్గేయకారకు లెట్లు అలంకరించిరనగా?

1 ముఖ్యాంగములగు పల్లవి, అనుపల్లవి, చరణములుండునట్లును, ఉ॥ వినతాసుత వాహనుడై, హరికాంభోజి. ఆది.

2 అముఖ్యాంగములగు చిట్టస్వర, స్వరసాహిత్య, మధ్యమకాల సాహిత్యములుగూడనుండునట్లును,

ఉ॥ నీలాంబరిలోని, శృంగారలహరిఅనుకృతిలో, సా;;రిసనిప అనునది చిట్టస్వరమునకు ముఖ్యఉదాహరణము.

ఉ॥ కల్యాణిలోని, నిన్నువినాగతిగాన అను కృతిలో
నిధమగరి -ధమగ రి } అనునది స్వరసాహిత్యమునకు ముఖ్య
నిరతముగ -నినుమది } ఉదాహరణము.

ఉ॥ దర్బారులోని, యోచనాకమలలోచన అను కృతిలో
ధనిపధమప-రిమరి } అనునది మధ్యమకాల సాహిత్యమునకు
కే.చననిజ-భ.క్త } ముఖ్య ఉదాహరణము.

3 సాహిత్యము చాలతక్కువగా నుండునట్లును,

4 సంగతులు, గమకములు, తదితరశాస్త్ర సంబంధమైన సౌందర్యము లెక్కువగా యుండునట్లును,

5 పల్లవానుపల్లవ, చరణములు ఒకదానికొకటి అనుసరించి యుండునట్లును,

6 సాహిత్యము, పల్లవికంటె అనుపల్లవిలో చక్కగను చరణములో విశదముగనుండునట్లును,

7 పల్లవి ప్రోత్సాహరూపముగను, సుబోధముగనుండు నట్లును,

8 ఎక్కువగా సంగీతమునకే ప్రాముఖ్యము నిచ్చునవి గాయుండునట్లును పై దెలిపిన విధమున ఆయా లక్షణములను వ్రాసివాగ్గేయకారకులు కృతుల నలంకరించిరని దెలియానగును.

(b) (i) జతులుగల ప్రబంధము:—ఉ॥ తిల్లాన. ఇది దేశీయరచనమైన "తిరితిల్లాన" నుండి తీయబడిన యొక సంగీత రచన. దీని ముగింపు మధ్యకాలముగనుండి సంగీతము జీవము కలదిగానుండును. ఒకపల్లవి, ఒకఅనుపల్లవి, చరణము గలిగియుండును. మాతువునందుగల పదములు వెదజల్లినట్లుండి స్వరసాహిత్యయుతమగు జతులు గలదిగానుండును.

ఉ॥ తధింధింతతసనం. ఫరజు. ఆది.

మరియు కృష్ణలీలాతరంగణిలోని కొన్ని తరంగములు తక, తరి, కిటు, ణకలవంటి జతులనుకలిగియుండుటచే నవియు జతులుగల ప్రబంధములని చెప్పబడుచున్నవి.

(ii) రెండుపల్లవులుగల ప్రబంధము:-ఉ॥ తానవర్ణము. వీనిలో రెండు పల్లవులుండును. అందు మొదటిది పల్లవి. రెండనది ఉపపల్లవి అని సాధారణముగా చెప్పబడు చరణమే. వర్ణములో చరణముతరువాత ప్రతియెత్తుగడ స్వరము పాడినపిమ్మటమరల చరణముపాడుదురుకాబట్టి చరణముకూడా ఒక పల్లవివంటిదని చెప్పవచ్చును. గనుక నీతానవర్ణమే రెండుపల్లవులుగల ప్రబంధమని చెప్పబడుచున్నది.

ఉ॥ సామినిన్నే కోరి. శంకరాభరణము. ఆది.

(iii) అంగములు వేరువేరు రాగములలోనుండు ప్రబంధము:- ఉ॥ రాగమాలిక. అంగములనబడు ఇందుగల వివిధ భాగములు వివిధరాగములలో నుండుటచే రాగమాలికనే అంగములు వేరువేరు రాగములలోనుండు ప్రబంధమని చెప్పుదురు. ఉ॥నిత్యకల్యాణి. రాగమాలిక. ఆది.

**5**. ఈ క్రిందివాటియొక్క సంక్షేపమైన వివరమేమనగా;-

(i) అష్టపది:—ఇదియొక శృంగారరస ప్రధానమైన సంగీతరచన. అష్టపదులు అనునవి 12వ శతాబ్దమున జనించిన జయదేవకవిచే వ్రాయబడినవి. ఈ గ్రంథమునకు "గీతగోవిందము" అని పేరు. ఈ శృంగారమహా కావ్యమునందు రాధాకృష్ణ ప్రేమతత్వము నాయక నాయకీ సఖులచే అష్టపదులుగా పాడబడును. ఇవి 24 కీర్తనలుగనుండి 12 సర్గలలో వ్రాయబడెను. ఒక్కొక్క కీర్తన 8 పాదములుగనుండును. ఇవిసంగీతకీర్తనలకు ప్రప్రథమమున యేర్పడినవిగా తెలియుచున్నవి. ఇవి సంస్కృతమునందు వ్రాయబడుటచే సాహిత్యజ్ఞానములేనివారి కీయష్టపదులంబలి భావము గ్రహించుట కష్టసాధ్యము. ఈ అష్టపదులు పల్లవి, అనుపల్లవి, చరణములుగాలేక అన్నియు నొక్కశైలిగల చరణములుగానుండి జయదేవముద్ర కలిగియుండును.

(ii) జతిస్వరము:—అనగా దీనిలో సంగీతము జీవము కలదిగాను ఆకర్షణీయముగాను వుండును. దీనికి పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగములు గలవు. దీనినడక సాధారణ

ముగా తానవర్ణమువలె మధ్యమకాలములో నుండును. శబ్దము వలె ఈ రచన ప్రత్యేకముగా నృత్యముకొరకు ఉద్దేశింప బడినది. గనుక సాధారణముగా దీనిలో సాహిత్యముండదు.

ఉ॥ సారిగా పా ధా సానిధా, అను బిలహరిలోని జతిస్వరము యిందులకు ముఖ్యఉదాహరణము.

(iii) పదవర్ణము:—అనగా వర్ణములు రెండువిధము లుగా. విభజింపబడుచున్నవి.1 తానవర్ణములు. 2 పదవర్ణము లు. రెండవ విధమునకు జెందిన యీ పదవర్ణములనేచౌకవర్ణ ములనియుకూడ చెప్పుదురు. వీనిలో పల్లవి, అనుపల్లవి, చర ణము, ఎత్తుగడ స్వరములుండును. తానవర్ణములందువలెగాక యీ పదవర్ణములందుగల ప్రతి పాదమునకు సాహిత్యముండి శృంగారరస ప్రధానమైయుండును. వీనిలో సంగీతము నడచువి ధము నెమ్మదిగానుండి భావములను దెలియజేయుటకు తగిన యవకాశమిచ్చును. ఇవి ముఖ్యముగా భోగముమేళములందు ప్రత్యేకించి ఉపయోగించుదురు. ఈపదవర్ణములు రచించినవా రిలో ముఖ్యులు;-గోవిందస్వామయ్య,పల్లవి శేషయ్యర్, రామ స్వామిశివన్, మైసూరు సదాశివరావు, కృష్ణయ్యర్ మొద లగువారు.

(iv) పంచమాంత్యరాగము;—అనగా ఒకరాగము లోని హెచ్చైన స్వరము మధ్యస్థాయిలోని పంచమము (ప) గా నుండిన అట్టి రాగమును పంచమాంత్యరాగమని చెప్ప బడును.

ఉదా:—నవరోజు. 29వ మేళజన్యము. ప ధ ని స రి గ మ ప—మ గ రి స ని ధ ప ఈ విధముగా నుండును.

(v) ప్లుతము:—అనగా తాళాంగములగు అనుద్రుత, ద్రుత, లఘు, గురు, ప్లుత, కాకపాదములగు నారింటిలో అయిదవ అంగము ప్లుతమని చెప్పబడును. ఇది యీ కాలమునందు వాడుకలో లేదు. యీ ప్లుతము మూడు భాగములుగా నుండును. (1) కొట్టి ఎంచుట (2) చుట్టుట (కృష్య) (3) విడచుట (సర్పిణి) గా నుండును. ఒక్కొక్క భాగమునకు 4 అక్షరకాలములవంతున మొత్తము 3×4=12 అక్షరకాలములుగానుండును. యీ ప్లుత క్రియను వేయువిధ మెటులనగా- ఎడమచేతిమీద కుడిచేతితో కొట్టి 3 అక్షరకాలములు వ్రేళ్ళనుయెంచి 4 అక్షరకాలములు ఎడమచేతిచుట్టు కుడిచేతిని త్రిప్పి 4 అక్షరకాలములు కుడిచేతినికుడివైపు క్రిందికి విడచుట ప్లుతమని చెప్పబడును. ఈ ప్లుతము $\frac{1}{8}$ యీ గురుతు గలదిగా నుండును.

**6**. (a) త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిలను సంగీతత్రిమూర్తులని చెప్పుటకు కారణములు.

1. ఈముగ్గురు గాయకశిఖామణులు ఒకేశతాబ్దము (1750-1850) లోనివారు.

2. ఈమువ్వురును ఒకేగ్రామము (తిరువారూరు) నందు జన్మించినవారు.

3. వీరు మువ్వురు సంస్కృ, తాంధ్ర, వేద, జ్యోతిష, సంగీతశాస్త్రములందు మిక్కిలి ప్రతిభగల బ్రాహ్మణోత్తములు.

4. ఈభక్తత్రయము వరుసగా నారద, చిత్తంబరనాధ సంగీతస్వాములయొక్క అనుగ్రహమునకు పాత్రులై సంగీత లక్ష్యలక్షణముల ననేకము గ్రహించినవారు.

5. ఈమువ్వురును భక్తితో చేసిన దైవోపాసనా ఫలిత ముగ దైవ సాక్షాత్కారము నొందిన వారు.

6. ఈకవిత్రయము కల్పించిన భావపూరితములైన కృతులును, హృదయరంజకమగు గానకళాకౌశలమును చరిత్రాత్మకములై యున్నవి.

7 ఈగాయకత్రయము తాము రచించిన కృతిపరంప రలను శిష్యమండలివలన లోకమునకు వెల్లడించిన సంగీతోద్ధా రకులు.

8. వీరు ముగ్గురు నిగ్రహ, అనుగ్రహ, శక్తులుకలిగి తమమహిమలను వెల్లడించినవారు.

9. ఈపండితత్రయము రచించిన సంగీత రచనలే కర్నా టక సంగీతమునకు ప్రాముఖ్యముగను, ప్రామాణికముగను, ఆదర్శ ప్రాయముగ నున్నవి.

10. కర్నాటకసంగీతాభి వృద్ధికై ఈవాగ్గేయకారకు లొనర్చిన కృషి అపారముగను, అమోఘముగను, చిరస్థాయి

గను వున్నది. గనుక త్యాగరాజ, దీక్షిత, శ్యామశాస్త్రిలు సంగీత త్రిమూర్తులని చెప్పుటకు ప్రబలకారణమైనవి.

(b) గోపాలకృష్ణభారతిగారి నందనారు చరిత్రము యొక్క విశేషమేమనగా:-ఇదియొక భక్తిరసపూరితమైన చరిత్రమగుటచే ఆద్యంతములును భక్తియొక్క ఉత్కృష్టతనే చాటుచుండును. పూర్వము దక్షిణదేశమున నందుడను మాలవాడొకడు పుట్టుకతోనే పరమ శివభక్తుడగుటచే క్షుద్రదేవతోపాసకులగు మాలలు విజాతీయమైన నందుని దైవభక్తిని మాన్ప అనేకవిధముల ప్రయత్నించివిఫలులైరి. నందుడు భక్తితో యాచిదంబరనాధునే సదా ధ్యానించుచు యాదేవదేవుని దర్శింప భక్తులతోగూడి చిదంబరమునకు జని ఆలయము వెలుపలనిలచి నటరాజస్వామిని ధ్యానింపవెంటనే స్వామివారి నందుని భక్తికి సంతసించి అగ్నిప్రవేశము జేయింప ఋషితుల్యుడై స్వామితో నైక్యము య్యెను. ఈభక్తచరిత్రమును గాయక, కవిశేఖరుడైన గోపాలకృష్ణభారతగారిచే నాటకరూపముగ వ్రాయబడినది. ఇందుగల ముఖ్యవిశేషాంశమేమనగా జాతి మత భేదములేక భక్తినే ప్రధానముగనెంచి లోకమునుద్ధరింపగల సర్వసముడు భగవంతుడొక్కడేయనియు, అట్టి భగవత్సాన్నిధ్యము నొందుటకు భక్తియే ప్రధానముగాని కులతత్వములు ప్రధానములు గావనియు యీనందుని దివ్యచరిత్రమువలన విస్పష్టమగు చున్నది. ఇదే నందనారు చరిత్రము యొక్క ముఖ్యవిశేషము.

## 7. (a) గోటు వాద్యమును గురించి వ్యాసము



ఇయ్యది సాధారణముగా చూచుటకు ఆకారమునం
దును తదితర అన్ని విషయములందును ప్రాచీనమైన వీణా
వాద్యమును బోలియుండును. ఇదివాద్యవిభాగములలో తంత్రీ
వాద్యములలో చేరిన మీటువాద్యమైయున్నది. దీనినే "మహా
నాటకవీణ" యని చెప్పుదురు.

ఈ గోటువాద్యమునకును వీణావాద్యమునకు చూచు
టకు వ్యత్యాసమంతగా లేకపోయినను, వీణయందువలె స్వర
స్థానముల నిరూపించుట కమర్పబడిన మెట్లుమాత్ర మీగోటు
వాద్యమునందుండవు. ఇది యొక్కటే యీ రెండు వాద్యము
లకు గల ముఖ్యవ్యత్యాసము. ఈ కారణముచే వయొలిన్
(ఫిడీలు) యందువలె అభ్యాసకులే స్వరస్థానముల నిర్ణయించు
కొనుచు వాద్యమొనర్పవలసియున్నది. గనుక అటుల స్వర
స్థానముల నిర్ణయించుకొనుటలో కుడిచేతితో మీటుచు ఎడ
మచేతి వ్రేళ్ళ నుపయోగింపకనే పిడివంటి దాదాపు 3 అం॥ కఱ్ఱ
ముక్కను ఎడమచేతితో పట్టుకొని తంత్రులమీదనుంచి ఆ పిడి
సహాయముచేతనే స్వరస్థానముల నేర్పరచుకొని వాయింపవలసి
యుండుటచేత అభ్యాసమునందు, నిదిమిక్కిలి కష్టతరవాద్యమై
యుండుటచేత అభ్యాసమునందు, నిదిమిక్కిలి కష్టతరవాద్యమై
యున్నది. ఐన
ననుమిక్కిలి రంజింపచేయదగిన సంగీతవాద్యమైయున్నది.

గా సంగీతమును నోటితో పాడకనే కచ్చేరీ చేయుటకర్హమై యున్నది. ఈగోటువాద్యమును గురించిన యితరవివరములు. అనగా తంత్రులసంఖ్య. వాని నామములు వాని రకములు, వానిని ఉపయోగించువిధము. వానిని శృతిచేయువిధము మొదలగునవి వీణావాద్యముయొక్క వివరములేనని గమనించునది.

(b) (i) కమానుతో వాయించబడు మెట్లు గల తంతివాద్యము ఉ॥ ఎస్రాజ్ (Esraj)

(ii) వ్రేళ్ళు, రంధ్రములు లేని గాలి వాద్యము. ఉ॥ గౌరీకాలమ్, తిరుచిన్నమ్, శంఖము మొదలగునవి.

## 8. శ్రీ త్యాగరాజ విరచితము

ధన్యాసిరాగము - చ. రూపకతాళము.

ప. శ్యామసుందరాంగ – సకలశక్తియు నీవేర (శ్యామ)
అ. తామసరహితగుణసాంద్ర – ధరను వెలయు రామచంద్ర (శ్యామ)
చ. దుష్టదనుజ మదవిదార – శిష్టజన హృదయవిహార (శ్యామ)
ఇష్టదైవము నీవేర – ఇలను త్యాగరాజువేర (శ్యామ)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. | పా; | పా – ప మగామా | పా ; | ; ; పా; | ‖ |
| | శ్యా; | మ – సుం . . ద | రాం; | ; ; గ ; | ‖ |
| 2. | ప నిధా | పా– ప మగామా | పా ; | ; ; పమపా | ‖ |
| | శ్యా . . | మ –సుం . . ద | రాం; | ; ; గ . . | ‖ |
| 3. | ని సనిధ | పా– ప మగామా | పా సా | సా; – నిధపమ | ‖ |
| | శ్యా . . . | మ –సుం . . ద | రాం . | . ; – గ . . . | ‖ |
| 4. | ప నిధా | పా– పమగామా | ప ని సరి | సని–రిసనిధపమ | ‖ |
| | శ్యా. . | మ–సుం . . ద | రాం. . . | . .–. .గ . . . | ‖ |

5. ప నిధా । పా–ప మగామా ॥ పా ; । పా–పమగమపా ॥
శ్యా. . । మ–సుం. . ద ॥ రాం; । గ–స. క. ల ॥

నీ; । సా రీ సా; – ॥ స నిరిస । గరిరిస–నిధపమ ॥
శ; । క్రియు నీ ; – ॥ వే... । ....–ర... ॥

(శ్యామ)

అ. పాపా । గాగా రీ సా ॥ స నిగరి । సని– సా; నీ ॥
తా మ । స ర హి త ॥ గు. ణ. । ..–సాం; . ॥

సా; । ; ; ; ; ॥ పనిసగ । రిస–రిసనిధపమ ॥
ద్ర; । . . . . ॥ .... । ..–.... ... ॥

పాపా । గాగా రీ సా ॥ స నిగరి । సని– సా;సా ॥
తా మ । స రహి త ॥ గు. ణ. । .. –సాం;ద్ర ॥

సనిగరి । సా–సారిసనిధప మ ॥ గ మపని । స రి– స నీధపమ ॥
ధ.ర. । ను –వె. .ల.యు. ॥ రా... । మ.–చం.ద్ర.. ॥

(శ్యామ)

చ. పా; । పాపాధాపా– ॥ ;మధ । పా–పమగామా ॥
దు; । ష్ట ద ను జ – ॥ ;మద । వి –దా. . ర ॥

పా; । పా–సనిధాపా ॥ ;మధ । పా– పమగామా ॥
దు; । ష్ట–ద. ను జ ॥ ;మద । వి –దా. . ర ॥

పా; । పాపానీసా ॥ సరి–నిస– । పని– ధపమగమా ॥
దు; । ష్ట ద నుజ ॥ మ.–ద.– । వి .–దా... ర ॥
పాధపమా । గారీసాసా ॥ ;మ గ । మా–పా;పా ॥
శి . . . । ష్ట జ నహృ ॥ ;దయ । వి – హా; ర ॥

పా; । గాగారీసా ‖ సా; । గరిసనిసా; ‖
ఇ ; । ష్ట దైవము ‖ నీ ; । వే... ర ; ‖

;; । ; ; ; ; ‖ పనిసగ । రిస–రిసనిధపమ ‖
.. । . . . . ‖ . . . . । . . – . . . . . . ‖

పా; । గాగారీసా ‖ సా; । గరిసనిసా; ‖
ఇ ; । ష్ట దైవము ‖ నీ ; । వే... ర; ‖

సనిగరి । సా–సారిసనిధపమ ‖ గమపని । సరి–సనీధపమ ‖
ఇ .ల. । ను–త్యా....గ . ‖ రా ... । జా.–వే. ర . . ‖

(శ్యామ)



# Government Technical Examinations.

## November 1935.

## Indian Music (Theory)–Higher Grade.

### ప్రశ్నలు.

1. నాదము, గతి, గమకము, ఈపదములయొక్క అర్థమును విశదముగ వ్రాయుము.

2. ఈ క్రింద వ్రాయబడియుండు రాగములలో యేరెంటికైనను లక్షణములను వ్రాయునది:—
   (i) ముఖారి. (ii) సహానా. (iii) పూర్వకల్యాణి.

3. (a) రాగాలాపన చేసే పద్ధతిని గురించి సంక్షేపముగా వ్రాయుడు.
   (b) ఆరోహణ అవరోహణ క్రమమునకు విరుద్ధమైన సంచారములు రాగములలో రావచ్చునా? అట్లురావచ్చునుఅంటే దానికిఏమిసమాధానము చెప్పుదురు? ఉదాహరణములు వ్రాయుడు.

4. (a) 72 మేళకర్తలలో సాధారణ గాంధారముండు చక్రముల పేర్లను వ్రాయుడు.
   (b) కర్నాటక సంగీతములో ఆవర్తముఒకటికి 7 అక్షరకాలములుగల 5 తాళములను తెలియజేయుము.

**5.** (a) పురందర విఠలరుయొక్క చరిత్రమును సంక్షేపముగా వ్రాయుడు. వారిచే కర్నాటక సంగీతమెట్లు అభివృద్ధి పొందినదో తెలుపుము.

(b) ఈ క్రింద కనుపరచియుండు ముద్రతో రచించిన వాగ్గేయ కారకుల పేర్లను దెలుపుము:— (1) గురుగుహ (2)మువ్వగోపాల (3)కుమార (4)గోపాలదాస.

**6** (a) "ప్రహ్లాద భక్తివిజయము" "రామనాటకము" వీటిని రచించిన వాగ్గేయకారకుల పేర్లను దెలుపుము. వాటిలోనేదైననొకదానినిగురించిసంక్షేపముగా వ్రాయుడు.

(b) కర్నాటక సంగీతములో శృంగారరసముతో గూడిన సాహిత్యముగల ప్రబంధముల(musical compositions) పేర్లను దెలుపుము.

**7.** (a) తాళవాద్యములవిభాగములను వ్రాయుడు.

(b) ఫిడీలుయొక్క భాగములనుగూర్చి పటసహితముగ నొకచిన్న వ్యాసమును వ్రాయుడు.

**8.** కేదారగౌళ, నీలాంబరి, హంసధ్వని, రాగములలోనేదైన ఒకరాగములో మీరునేర్చుకొన్న కృతినిస్వరసాహిత్యతాళాంగములతో వ్రాయుడు.

## జ వా బు లు.

**1.** (i) నాదము:— అనగా సంగీతధ్వని. లేక సంగీత పరికరముయొక్క స్వరము. అనగా ఒక వీణానాదము, మరియొకవీణానాదముకంటె ఎక్కువని మనము చెప్పునపుడు ఆ రెండింటియొక్క వ్యత్యాసము దెలియజేయునదియే నాదమని దెలియనగును. ఈ పదముయొక్క అర్ధమేమనగా నాదమను రెండక్షరములలో నకారము ప్రాణమనియు, దకారము అగ్నియనియు సంజ్ఞగావున నట్టి ప్రాణాగ్నుల సంయోగమువలన యేర్పడుధ్వని విశేషము నాదమనిచెప్పబడును.

(ii) గతి:—అనగా తాళమునకుఆధారముగనుండిలీనమై నిర్ణీతసమయములందు కలుగుధ్వనివిశేషము గతి యని చెప్పబడును. అనగా తాళముయొక్క అక్షరకాలములోని సమానాంతర్భాగములు కళలనిచెప్పబడును. ఈకళలు హ్రస్వాక్షర ప్రమాణముగ నుండి ఒక్కొక్కఅక్షరకాలమునకు 3లేక 4లేక 5లేక 7లేక 9వంతున నడచుచుండును. కళలు నడచువిధమునకే గతియనిచెప్పబడును.

(3) గమకము;—అనగా హిందూదేశ సంగీతములో నుపయోగింపబడు వివిధములగు అందములు, కదలికలు అలంకారములు మొదలగు ఆకర్షణలకు అర్థమిచ్చు పదమునకు "గమక"మనిపేరు. అనగా గానముజేయునపుడు సంగీత సంప్రదాయజ్ఞులు స్వరములను బలుకునపుడు వానికిగల సహజమైన ధ్వనులందేవాని నుచ్చరించక ఆ స్వరమునకు నంటి

యుండు మీది స్వరముయొక్క నాదచ్ఛాయను పొందించి వినువారి చిత్తమున కింపుగలుగునటుల స్వరములను కదలించుట లేకవిసరుటవలన గమకము యేర్పడుచున్నది. ఈ గమకము మధురగానమునకు సమయమునకు వచ్చిపోవు అలంకారము లేక ముఖ్యాంగమని చెప్పవలెను. ఇటులస్వరములను తగిన గమకములతో ధ్వనింపజేయుట హిందూదేశ సంగీతమునకు జీవమును ఆత్మను యేర్పరచుచున్నది. గనుకనే సోమనాథుడు గమకములులేనిసంగీతము, చంద్రుడులేనిరాత్రి,నీరులేనినది పుష్పములులేనిలతలవంటిదియని చెప్పియున్నారు. అనగా శోభింపనేరదనియర్థము.

**2**.(i) ముఖారి రాగలక్షణము:- ఇది 60 పుటయందుగల 1932వ సంవత్సరములోని 3వ ప్రశ్నలో 2 జవాబునందు వ్రాయబడుట గమనించునది.

(ii) సహానారాగలక్షణము:—ఇది 21పుటయందుగల 1930వ సంవత్సరములోని 7వ, ప్రశ్నలో 3వ, జవాబునందు వ్రాయబడుట గమనించునది.

iii పూర్వకల్యాణి రాగలక్షణము:- ఇది 82వ పుటయందుగల 1933వ సంవత్సరములోని 1వ ప్రశ్నలో 4వ జవాబునందు వ్రాయబడుట గమనించునది.

**3**.(a) రాగాలాపనచేయు పద్ధతి :—

రాగముయొక్క ఆలాపనమే "ఆలప్తి"యని చెప్పబడును. ఈ ఆలప్తిలో నెచ్చోటను "ఆక్షిప్తి" కాలాపనమే

మొదటిదిగానుండును. "ఆక్షిప్తిక" యనగా రాగమును ముగ ఆలాపించిపాడుటయని అర్థము. దీనినే "ఆయు యుజెప్పుదురు. మనుష్యుడు తానభివృద్ధిజెందుటకు ఆ నపేక్షించునటుల రాగము తానభివృద్ధి జెందుటకు ఆక్షిప్తికయను రాగాలాపనమును యపేక్షించుచున్నది. ప్తికారాగాలాపనమెటులనగా, రాగమును మొదటమధ్య షడ్జమునుండి ప్రారంభించి, మంద్రస్థాయియందును, మధ్య రిషభ, గాంధారములందును గానముజేసి పిమ్మట గాం క్తికిని, రాగలక్షణమునకును తగినటుల తారస్థాయి గాంధార, మధ్యమ, పంచమములవరకు నాలాపించి ధ్యస్థాయి షడ్జమునకువచ్చి పూర్తిచేయవలెను. ఇటుల యిలందు చేయురాగాలాపనమునే "ఆక్షిప్తిక" లేక " మని చెప్పుదురు. ఆక్షిప్తికానంతరముచేయు రాగా ఈక్రింది విధముగా నుండును. (ఆక్షిప్తిక=ముందుకు

(i) ఒకటవ రాగవర్ధని:— మొదట మధ్య నుండి ప్రారంభించి మంద్ర స్థాయియందును మధ్యస్థా దును రాగాలాపనచేయవలెను. అట్లు రాగాలాపన చే స్వరములను గమకభేదములతో రాగస్వరూపమును చునటులను, విళంబకాలప్రధానమై అచ్చటచ్చట మ కాలముల నిమిడ్చి, అన్యస్వరములను సందర్భా ముగ ప్రయోగించుచు తారస్థాయి పంచమమువరకు చితిరిగి క్రమముగా మధ్యస్థాయి షడ్జమునకు వచ్చి

(ii) రెండవరాగవర్ధని:— ఇదియుమొదటి

నివలె, విచిత్రకల్పనలతో, ఆలాపనచేసి మధ్యస్థాయిలో ముఖ్యముగను, తక్కినస్థాయిలందు యెడనెడ ఆలాపించుచు తారస్థాయిపంచమమువరకు వెళ్ళి తిరిగిమధ్యస్థాయి షడ్జమునకు వచ్చి చేరవలెను. (రాగవర్ధని=రాగమును పెంచుట)

(iii)మూడవరాగవర్ధని :—దీనిని రెండవరాగవర్ధనివలెరాగాలాపనచేయుచు తారస్థాయియందే ప్రధానముగ సంచరించి తిరిగిమధ్యషడ్జమునకు వచ్చి చేరవలెను.

(iv) నాల్గవరాగవర్ధని:— దీనిని రెండవ మూడవ రాగవర్ధనులవలె ఆలాపించుచు విశేషముగ మూర్ఛనాప్రస్తారములతో ఆలాపించవలెను. ఇటుల పైనాలుగురాగవర్ధనులను ఆలాపించునపుడు వరుసగా మొదటిది, 20నిమిషములైన రెండవది 10 నిమిషములును మూడవది 5 నిమిషములును నాల్గవది 2½నిమిషములును ఈక్రమమునననుసరించి ఆలాపించవలెననియు,అటుల ఆలాపించనియెడల రాగరంజకము చెడుననియు సంగీతసంప్రదాయజ్ఞులు చెప్పుదురు.

(b) ఆరోహణ, అవరోహణ క్రమమునకు విరుద్ధమైన సంచారములు రాగములలోరావచ్చును. ఎటులనగా రాగాలాపనలో రంజకముకొరకై కొన్నిరాగములలో 1గాని 2గాని 3గాని స్వరములనువర్జించియు లేక అన్యస్వరములను ప్రయోగించియుసంచారముచేయుట సంప్రదాయసిద్ధమైయున్నందున ఆరోహణావరోహణ క్రమమునకు విరుద్ధమైన సంచారములు రాగములలోరావచ్చునని స్పష్టమగుచున్నది.

ఉదాహరణము:—(i)శంకరాభరణము:— ఇది 29వ మేళకర్త జన్యరాగమగుటచే ఆరోహణావరోహణములందు సప్తస్వరములున్నను అవరోహణ సంచారములందు స ధ ప మ, స ని ప మ అనెడి వర్జప్రయోగములు యీరాగములో వచ్చుట రంజకమును లక్షణం సంప్రదాయమై యున్నది.

(ii) కాంభోజిరాగము:- ఇది 28వ మేళకర్త జన్యమైన షాడవసంపూర్ణరాగమగుటచే ఆరోహణముషాడవమై అవరోహణమునందు సప్తస్వరములున్నను అవరోహణ సంచారములందు రాగరంజకమునకై స ని[3] ప ధ సా యనెడి వర్జమును అన్యస్వరమునగు ప్రయోగములు యీరాగములోవచ్చుట రంజకమునులక్షణసంప్రదాయముగా నున్నది.

(ii) సారంగరాగము:— ఇది 65వ మేళకర్త జన్యమైన సంపూర్ణరాగమగుటచే ఆరోహణ, అవరోహణములందు సప్తస్వరములున్నను అవరోహణ సంచారమందు స ధా ప య నువిధమున వర్జముగల ప్రయోగములను రాగరంజనముకై సంచారముచేయుట సంప్రదాయమైయున్నది. ఇటులనే యింకను కొన్నిరాగములందు వచ్చుచున్నవి. గనుక ఆరోహణ అవరోహణ క్రమమునకు విరుద్ధమైన సంచారములు రాగములందు రావచ్చునని స్పష్టమగుచున్నది.

4.(a) 72 మేళకర్తలలో సాధారణ గాంధారముగల చక్రము లేవనగా:-

2వ నేత్రచక్రము, 4వ వేదచక్రము, 8వ వసుచక్రము 10వ దిశిచక్రము. ఈ నాలుగు చక్రములందును సాధారణ గాంధారముండును.

(b) కర్నాటక సంగీతమున ఆవర్తమునకొకటికి 7 అక్షరకాలములుగల 5 తాళములేవనగా:-

| తాళములు. | అంగసంజ్ఞలు. | | అక్షరవివరము. | | అక్షరసంఖ్య. |
|---|---|---|---|---|---|
| 1 త్రిశ్రజాతి త్రిపుట | $_3$ 0 0 | ... | 3+2+2 | = | 7 |
| 2 చతురశ్రజాతి ఝంప | $_4$◡ 0 | ... | 4+1+2 | = | 7 |
| 3 ఖండజాతిరూపకము | 0 $_5$ | ... | 2+5 | = | 7 |
| 4 మిశ్రజాతి ఏక | $\|_7$ | ... | 7 | = | 7 |
| 5 మిశ్రచాపు | ◡$_3$◡$_4$ | ... | 3+4 | = | 7 |

## 5.(a) పురందరవిఠల్ వారి చరిత్రము.

ఇతడు కర్నాటక బ్రాహ్మణుడు. మధ్వ మతస్థుడు. తండ్రిపేరు వరదప్ప. భార్యపేరు సరస్వతి. 16వ శతాబ్దము లోనివాడు. భక్తాగ్రేసరుడు. సంగీత సాహిత్యములలో గొప్ప పండితుడు. దేవర్నామములు కన్నడమున వ్రాసి తరించిన ఘనుడు. ఇతడు మొట్టమొదట పూనానగరమున సాహుకారై కోటీశ్వరుడుగానుండి పాండురంగ విఠలునియందు గలభక్త్యతిశయమువలన విరక్తి గలిగి తనయావదాస్తిని దాన ధర్మములుచేసిన గొప్పత్యాగి. భక్తిచే యితడొక్కొక్క సందర్భమందు రచించిన కీర్తనములచే పండరీనాథుని ప్రసన్నతనుగూడ జెందినవాడై యుండెను. వేదోపనిషత్తులను ప్రజలకు బోధించెను.

సంగీతము బోధనకనువుగ రచింపబడి నేటికిని వాడుకలోనున్న "స్వరావళి" అలంకారములు, పిళ్ళారిగీతములును, మరియు తాయములు, సూళాదులు, ప్రబంధములును యీ మహానుభావునివలన నేరచింపబడినవి. ఇతని కీర్తనలు వేదాంత విషయము కలవిగానుండును. స్వరావళిని, మాయామాళవ గౌళ రాగమున బోధించుపద్ధతిని యితడే ప్రారంభించెను. ఈతనికి "కర్నాటక సంగీత పితామహ"యని బిరుదుగలదు. ఈతని గురించిన యద్భుత చరిత్రము లెన్నియోగలవు.

(b) ఈక్రిందిముద్రలతో రచించిన వాగ్గేయ కారకులు:-

(i) "గురుగుహ" ఈముద్రతో రచించినది — ముద్దుస్వామి దీక్షితులు

(ii) "మువ్వగోపాల" ,, ,, — క్షేత్రజ్ఞులు

(iii) "కుమార" ,, ,, — సుబ్బరాయశాస్త్రి

(iv) "గోపాలదాస" ,, ,, — వీణకుప్పయ్యర్

**6.** a (i) ప్రహ్లాద భక్తివిజయము రచించిన వాగ్గేయ కారకుడు;— త్యాగరాజు.

(ii) రామనాటకము రచించిన వాగ్గేయ కారకుడు;— అరుణాచలకవిరాయర్.

**ప్రహ్లాద భక్తివిజయము.**

(i) త్యాగరాజు తెనుగున వ్రాసిన ప్రహ్లాదభక్తివిజయము దేశీయ (వీధి) నాటకమని పిలువదగినది. "నాటకము"

అనుపదము సంస్కృతభాషకు చెందినది. భరతఖండమునగల భాషలకన్నిటికిని సంస్కృతము మాతృభాష గనుక, దానిపోలికలు మిగిలిన భాషలలో గన్పింపకమానవు. కానిసంస్కృతములోని నాటకములతీరు వేరు. అవి నాగరికముకలవి. తెలుగు దేశములో నాగరికము లేని రోజులలో దేశీయ (వీధి) నాటకములుబయలు దేరినవి.

ఈ దేశీయనాటకములు— (i)వీధినాటకములు (ii)వీధిభాగవతములునను రెండు తెగలుగాగన్పట్టుచున్నవి.

ఇందు ఈ ప్రహ్లాదభక్తి విజయము వీధిభాగవతముగా నున్నది. భాగవతముఅను పేరు భగవద్భక్తి నే బోధించునను యభిప్రాయముకలిగించును. అనగానిందు భక్తియే ప్రధానరసము. ఇందలిగేయములు కీర్తనలనిపించుకొనును. కీర్తించునవిగనుకకీర్తనలనబడును. కీర్తనలు భక్తిరససూచకములు. మరియుభక్తిరసమునకుదగినపాత్రము లేయిందుగల్పింపబడును. వీర, భయానక, భీభత్సాదిరసములకిందు దావులేదు. కనుక నే హిరణ్యకశిపుని క్రూరచర్యలు, రాక్షసకృత్యములు యిందు మందునకైనగానరాకున్నవి. ఇందలి గేయములు భక్తిరసపోషకములై మృదుమధురశైలి కలిగియున్నవి. తక్కిన గేయసాధనములందుకుతగియున్నవి. ఇందలి కథాసారాంశము—

గరుత్మంతుడు, సముద్రుడు ప్రహ్లాదునిరక్షించుట. నారదునిదర్శనము. ప్రహ్లాదుడు నారదుని స్తుతించుట. భగవంతుడు ప్రత్యక్షమగుట. ప్రహ్లాదుడుభగవంతునిగూర్చి స్తుతించుట.

విష్ణు ప్రహ్లాదుల భక్తిరససంభాషణము అనుకథలు ప్రధానములై భక్తిరస మొలుకుచున్నవి.

ఇందలి నాటకలక్షణములలో—

మొదట దౌవారికుడు వచ్చుట, పిమ్మట సూత్రధారుని రాకయు సంస్కృత నాటకములపోలికనున్నవి. సముద్రుడు వైనతేయుడు ప్రహ్లాదునిరక్షించుటనుగూర్చిన కథకల్పితము. ఈకల్పనపద్ధతియు సంస్కృతనాటకములనుండి వచ్చినదియే. ఇందైదంకములున్నవి. అంకవిభాగము సంస్కృతమూలమే. ఇదే త్యాగరాజుగారి ప్రహ్లాద భక్తి విజయముగురించిన వివరము.

కర్నాటకసంగీతములో శృంగారరసముతో గూడిన సాహిత్యము గలప్రబంధములేవనగా:—

(i) పదములు (ii) అష్టపదులు (iii) జావళీలు మొదలగునవి. మరియు నాయకానాయకి భావముగల ప్రతిప్రబంధమును పైరకమునకు జెందినవిగా జెప్పవచ్చును.

**7**. (a) తాళవాద్యముల విభాగములేవనగా:—వీటిలోననేక రకములుగలవు. (i) చాలవరకు కాలమునే సూచించుటకేర్పడిన వాద్యములు. ఉ॥మృదంగము, తబలా, నగారా డోల్, డోలక్, డమరు, మర్దలమ్, శుద్ధమద్దలమ్,కంజీరా మొదలగునవి. మరియుయుద్ధసమయములందు వాయింపబడు భేరీ నగారాలవంటికొన్నివాద్యములు యీరకములోనివైయున్నవి.

(ii) కేవలము కాలమునేసూచించుట కేర్పడినవాద్యములు. వీటినిలోహముతోచేయుదురు ఉ॥(i)జాల్‌రా.ఇది హారి

కథలలోను భజనలలో నుపయోగింతురు. (ii) బ్రహ్మతాళము. ఇది దేవతాసంబంధమైన ఉత్సవములందును అనేకులుకలసిపాడు సంగీతమందును వుపయోగింతురు.

ఆయాంతరగతులబట్టి వీటినితిరుగ 6 విధములుగా విభజింపబడుచున్నవి.

(i) జే గంటలు (stone gongs) (ii) లోహపు తాళములు (iii) తంబటం, కంజీరాలవలె ఒకవైపు అనాచ్ఛాదితమైనడ్రమ్ములు. (iv) కుండలతోనుకొయ్యలతోను చేయబడి ఒకవైపుచర్మముగల డ్రమ్ములు. (v) రెండువైపుల చర్మముగల డోల్, డోలక్ లవంటిడ్రమ్ములు. (vi) రెండువైపుల చర్మముగలిగి ఆరోహణావరోహణములను దెలుపుచువాయింపబడు మృదంగమువంటిడ్రమ్ములు. ఇదే తాళ వాద్యవిభాగములవివరము.

### b. ఫిడేలు వయొలిన్ యొక్క భాగములనుగురించివ్యాసము.




ఈ పటమునందు జూపబడిన ఫిడిల్ వాద్యము వాద్యవిభాగములలో తంత్రీవాద్యములో చేరినదైయున్నది.

ఇయ్యది కర్నాటక సంగీతమును శాస్త్రయుక్తముగను అమూలాగ్రముగను ప్రదర్శించుట కనువగువాద్యమగుటచే నిదియొక ప్రాముఖ్యమైన సంగీతవాద్యమని చెప్పబడుచున్నది. అనగా నోటితో పాడకనే (సోలో) కచ్చేరీచేయుట కర్హమైయున్నది. ఇందలి ముఖ్యవిశేషమేమనగా ఇయ్యది కర్నాటక హిందూస్థానీ సంగీతములేగాక పాశ్చాత్య సంగీతము సహితము ప్రదర్శింపగలదియై గాత్రగానమునందేగాక తదితర ముఖ్య జంత్రగానములందు సహితము ప్రక్కవాద్యముగా నుపయోగించుట కర్హమైనదగుటచే తంత్రీవాద్యములలోనిది యొక శ్రేష్టమైన వాద్యముగా పరిగణింపబడుచున్నది.

ఇవి మూడువిధములుగా నుండును. (i) నిండుసైజు గలవి. (ii) ($\frac{3}{4}$) ముప్పాతికసైజు గలవి (iii) ($\frac{1}{2}$) అర్ధసైజు గలవి. అభ్యాసకులయొక్క వయస్సునుబట్టి ఆయాసైజుగల ఫిడీలులను వాడుదురు.

ఈ వాద్యపటమునందు గుర్తులతో జూపిన ఆయాభాగములయొక్క పేర్లను ఈ దిగువను దెలుపుట గమనించునది.

"A" తలలేక స్క్రోల్ (Scroll). "B" "B" చెవులు (Pegs). "C" మెడ (Neck). 'D" వేళ్ళు అనుకునే బల్ల (Finger. Board). "E" పీట లేక వంతెన (Bridge). "F" "F" ధ్వనినిచ్చు రంధ్రములు లేక *f* వంటిరంధ్రములు. "G" తోక ముక్క (Tail piece). "I" నట్ (Nut). "K" "K" అర్ధచంద్రాకారముగల ధ్వని నిచ్చు బల్ల లేక గర్భము. "L"

"L" వంపులు (Ribs). అడుగు భాగము వెనుక భాగము (The back) అని చెప్పబడును.

గురుతులతో నుండుకమాన్ (Bow) యొక్క భాగముల పేర్లను ఈదిగువదెలుపుటగమనించునది. "A" కఱ్ఱ (Stick) "B" నట్ (Nut) "C" సీల (Screw) "D" వెంట్రుకలు (Hair) "E" తల (Head or Point) అని చెప్పబడును.

ఫిడీలు (వయొలిన్)కు 4 తంత్రులుండును. వానిపేర్లను ఈ దిగువను దెలుపుట గమనించునది. మొదటి తంతి మధ్యపంచమము లేకపంచమము(E string) రెండవతంతి మధ్యషడ్జము లేకసారణి(A string). మూడవ తంతి మంద్రపంచమము లేక తగ్గుపంచమము (D string) నాల్గవ తంతి మంద్రషడ్జము లేక మందరము (G silver string) అని చెప్పబడును.

పై నాలుగు తంత్రులను "G" గుర్తుగలచోట ముడివైచి "B" గుర్తులుగల తావులందుంచు చెవులకుచుట్టుదురు. పై విషయములే ఫిడీలు (వయొలిన్) యొక్క అన్నిభాగముల గూర్చిన ముఖ్య వివరమని దెలియనగును.

# శ్రీ మైసూరు లింగరాజ విరచితం.

## నీలాంబరి రాగము - ఆదితాళము.

ప. శృంగారలహరి - ఆశ్రితజనశుభకరి (శృం)

అ. సంగీతబ్రహ్మానంద-మధుమాధురి మధుమధుకరి మంగళాంగి మదనారి మనోహరిమామవ (శృం)

చ. అంగజారి హృదయంగమదరహసితే-అఖిలాగమసన్నుతే-భృంగచికురే కరుణారస భరభరితే-ఉ
త్తుంగజఘనలలితే - సురసేవితే - లింగరాజ వదనాంబుజ పూజితే (శృం)

ప. సా ;సని-పా,నిసా,ని-పనిసని-పామాగా గరి । గా,మపామా; । స నిపమ-గమపని ॥
శృం; ..-గా, . . , .- . . . . - . ర ల హ. । రి , . . . ; । శ్రితజన-శుభకరి ॥

2. ,, ,, -పనిసరిసని మాగరి । గా,మపామా-సా । ,, ॥
,, ,, - . . . . . . ర లహ. । రి , . . . -ఆ । ,, ॥

3. సా ;సని-పనిసరిసని-పనిసని-పనిపపమాగా-గరి । ,, । ,, ॥
శృం; . .-గా. . . . . - . . . . - . . . . ర ల -హ. । ,, । ,, ॥ (శృం)

అ. ; ; - ‹ ధ ప పా ; పాధపమా; । ; ప ని సా, ని । పనిపనిసానీ-సనినీపా ॥
సం ; ; - గీ . . త ; . . . . ; । ; బ్ర .హ్మా, . । నం. . . . . -. . . ద

ప ని సాసని–ప ని సరిసనిపామా; గ మ ప | ధప మపప మమా గారి | మా గరిగా సస ||
మధుమాధురి–మధుమ.ధు. క రి ;మంగళాం | . గి మదనా. . రి మ | నో హరివామవ ||

చి. స్వ. సా ; ; – రిసని ప – సనిపమ – గమ | పా; ; – గ మ | పసనిప– గమపని ||

సరి సని – సనిప మ – పనిపమ –. పమగమ– | రి గమ –రిగరిపా | మా , –గామపని ||

ససనిప – నినిపమ – పపమగ – మ మగస– | మగ పమ –నిపసని | పమగమ–పని2ధని$_2$ ||

పధపప – మగ స – పమగస – నిపమగస | సనిపమగస–రి స | నిప మ –గామపని ||

(శ్రం)

చ. గామపాప– ప ని సా,నిపమ – గమగ రి | గా,మపామా,గమ | పాపపమగరి గా,మపా ||
అంగ జారి–హృదయం,,గమ – దరహసి | తే,. . . ,అఖి | లాగమ,. . స ,న్నుతే ||

గా మ పప ప – ప ని సరిసనిపమ–గమగరి | గా,మపామా; | మగరిగమపమగరిగాస ||
భృంగ చికు రే – క రుణా . . .ర స –భర భరి | తే,. . . ; | . . . . . . . . . . ఉ ||

సా సస సస – సరిసాససనిధానీసా | ,స రిసా స పని | స రిసని పమగమపని ||
త్తుంగజఘన – లలితేసురపే. . వి తే | ,లింగరాజ వద | నాం. . .బుజపూ. జి తే ||

(చరణముచివర చిట్టస్వరము పాడి పల్లవి ఎత్తుకొనవలయును.) (శ్రం)

# Government Technical Examinations.

## November 1936.

## Indian Music (Theory)–Higher Grade.

### ప్రశ్నలు.

**1.** ఈ క్రింద వ్రాయబడియుండు రాగముల యొక్క లక్షణములను విశదముగ వ్రాయునది:—

(i) హరికాంభోజి (ii) సారంగ.

**2.**(a) వర్జరాగములయొక్క విభాగములను గురించి సంక్షేపముగా వ్రాయుడు.

(b) ఈ క్రిందివాటిలో ఒక్కొక్కటికిని ఉదాహరణము తెలియజేయుడు.

(i) కరుణారస ప్రధానమైనరాగము (ii) మంద్రస్థాయి నిషాదమునకు క్రింద సంచారము లేని రాగము (iii) సాయంకాలమందు పాడదగినరాగము.

**3.** (a) రాగమాలికయొక్క లక్షణమును వ్రాయుడు.

(b) ప్రసిద్ధమైన రాగమాలికల పేర్లను దెలుపుము.

(c) రాగమాలికలో రాగములు ఏ వరుసక్రమముగా రావచ్చును? దీనికి ఏమైన నిబంధనలు గలవా?

**4.** (a) ఈ క్రిందివాటిని సంక్షేపముగా వ్రాయుడు:—

(i) అష్టపది. (ii) నౌకాచరిత్రము. (iii) ఘనపంచ

కము (iv) కంపితము.

(b) 35 తాళములుగాక కర్నాటక సంగీతములో యితర తాళములు గలవా? అట్లున్న వానినిఉదహరింపుము.

**5.** (a) రాగముల చరిత్రములను యెరుగుటకు వేంకటమఖి వారు రచించిన రాగాంగ లక్షణ గీతములు యెట్లు సాధకమైయున్నవి.

(b) శ్యామశాస్త్రిలవారిచే లేక ముద్దుస్వామి దీక్షితుల వారిచే రచింపబడిన కృతులలో మీరు నేర్చుకొన్న కృతియొక్క విశేషమునుగురించి వ్యాసము వ్రాయుడు.

**6.** (a) ఈ క్రింద కనుపరచియుండు ముద్రలతో రచించిన వాగ్గేయ కారకుల పేర్లను దెలుపుము:—

(i) వేంకటేశ్వర (ii) పద్మనాభ (iii) గర్భపురి (iv) ఉమాదాస.

(b) అరవ కీర్తనములనురచించిన 4గురు వాగ్గేయకారకుల పేర్లను దెలుపుము.

**7.** (a) వీణావాద్యమును గురించి పటసహితముగా నొక చిన్న వ్యాసము వ్రాయుడు.

(b) వీణావాద్యము యొక్క చరిత్రమును సంక్షేపముగా వ్రాయుము.

**8.** సావేరి, లేక బేగడ రాగములో మీరు నేర్చుకొన్న కృతిని స్వరసాహిత్య తాళాంగములతో వ్రాయుడు.

## జ వా బు లు.

**1.** (i) హరికాంభోజిరాగలక్షణము:— ఇది 28వ మేళకర్తరాగము.

ఆరోహణము:—స రి$^2$ గ$_3$ మ$^1$ ప ధ$^2$ ని$^2$ స.

అవరోహణము:—స ని$^2$ ధ$^2$ ప మ$^1$ గ$^3$ రి$^2$ స.

రాగాంగము, సంపూర్ణము, షడ్జగ్రహము, రక్తిరాగము, సర్వస్వర గమక వరికరాగము. ఎల్లప్పుడును గానము సేయదగును. ఇందు రిషభ, గాంధార, మధ్యమ, ధైవత నిషాదములు రాగచ్ఛాయాస్వరములు. ఇది పెద్దరాగములలో నొకటిగానున్నది. ఇందుగల ముఖ్యసంచారములు:—

మపధనిసాసాసరినీధపా-ధనిసరిగమగారిసా-సనిరిసనీధపా- మగమపధనీధపా-మపధపమగా- గమపమమగగరి-రిగారిసా - సాసనిధనిపధానిసానిరీసా మొదలగునవి.

(ii) సారంగరాగలక్షణము:—ఇది 65వ మేళకర్తయగుమేచకల్యాణి రాగమున జనించిన జన్యరాగము.

ఆరోహణము:—స రి$^2$ గ$^3$ మ$^2$ ప ధ$^2$ ని$^3$ స.

అవరోహణము:—స ని$^3$ ధ$^2$ ప మ$^2$ రి$^2$ గ$^3$ మ$^1$ రి$^2$ స.

సంపూర్ణరాగము, భాషాంగరాగము, షడ్జగ్రహము రక్తిరాగము. ఎల్లప్పుడు గానము సేయదగును. ఈ రాగమున

అవరోహణమున "పమరిగమ1రిస" అనువక్రమువర్జముగలసంచారమున శుద్ధమధ్యమము బలుకును. ఈ అన్యస్వర ప్రయోగములవలననే యిదిభాషాంగరాగమైనది. ఇందు రిషభ, గాంధార, ధైవతములు రాగచ్ఛాయాస్వరములు. ఈరాగమున కొన్ని సంచారములు సరిసపమపధనిస, సధాప- యనెడి వర్జముగలవిగానున్నవి. ఈ రాగమున మంద్రస్థాయి నిషాదమునకు క్రిందను తారస్థాయి గాంధారమునకు పైనను సంచారములులేవు.

ఇందుగల ముఖ్యసంచారములు—

గమపధనిసా సా-సగరిసా-సనిరిసనిధపా-పమధపమరిగమ1రిస-సపమధప-నిధపమరిగమపా-మపధనిసరిసధాప-పమరిగమ1రిసనిసా నిరిసా మొదలగునవి.

**2.**(a) వర్జరాగములనగా:—జన్యరాగములలో ఆరోహణమునగాని అవరోహణమునగాని లేక రెంటియందుగాని 1 లేక 2 లేక 3 స్వరములు లోపించియున్న రాగములను వర్జరాగములందురు. ఇవివక్రములుగాగాని, వక్రములు కానివిగాగాని యుండవచ్చును. ఆరోహణ అవరోహణములందుగల స్వరముల సంఖ్యనుబట్టి ఈవర్జరాగములు 8 విధములుగా విభజింపబడుచున్నవి. ఈ వర్జరాగముల ఆరోహణావరోహణములందుగల స్వరముల లెక్కించునపుడు సూత్రము ననుసరించి తారస్థాయిషడ్జమునువదలిపెట్టవలెను. మరియువీనివివరములన్నియు ఉదాహరణములతో నీక్రింద దెలుపబడుట గమనించునది.

| | ఆరో॥ అవ॥. | ఉ॥రాగములు. | ఆరోహణము-అవరోహణము. | | మే॥సం॥ |
|---|---|---|---|---|---|
| 1 | షాడవ-సంపూర్ణ<br>6 7 | కాంభోజి | సరిగమపధస | – సనిధపమగరిస | 28 |
| 2 | ఔడవ-సంపూర్ణ<br>5 7 | బిలహరి | సరిగపధస | – సనిధపమగరిస | 29 |
| 3 | సంపూర్ణ-షాడవ<br>7 6 | భైరవము | సరిగమపధనిస | – సధపమగరిస | 17 |
| 4 | సంపూర్ణ-ఔడవ<br>7 5 | సారమతి | సరిగమపధనిస | – సనిధమగస | 20 |
| 5 | షాడవ-షాడవ<br>6 6 | శ్రీరంజని | సరిగమధనిస | – సనిధమగరిస | 22 |
| 6 | షాడవ-ఔడవ<br>6 5 | నాటకురంజి | సరిగమధనిస | – సనిధమగస | 28 |
| 7 | ఔడవ-షాడవ<br>5 6 | మలహరి | సరిమపధస | – సధపమగరిస | 15 |
| 8 | ఔడవ-ఔడవ<br>5 5 | శుద్ధసావేరి | సరిమపధస | – సధపమరిస | 29 |

72 మేళకర్తరాగములలోని ప్రతిమేళకర్తరాగమునకు పై విధమున 8 విధములగు వర్జరాగములుగలవు. ఇవి ఒక్కొక్కటి ఔడవ, షాడవ, సంపూర్ణ భేదములొందుటచే ఒక్కొక్క మేళకర్తకు 483 రాగములచొప్పున 483×72=34,776 వర్జరాగములేర్పడు చున్నవి. అనగా 72 మేళకర్త రాగముల నుండి సాధ్యమైనంతవరకు తీయగల వర్జరాగములసంఖ్య అని గ్రహించునది.

(1) కరుణారస ప్రధానమైనరాగము:—ఉ॥ ఫలమంజరిరాగము. ఇది రాగనవరసములగు శృంగార, హాస్య, కరుణ,

రౌద్ర, వీర, భయానక, భీభత్స, అద్భుత, శాంతరసములలో మూడవరసమునకు చెందినదిగానున్నది.

(2) మంద్రస్థాయి నిషాదమునకు క్రింద సంచారము లేని రాగము.ఉ॥నాదనామక్రియ. సరిగమపధని-నిధపమగరిసని. ఈవిధము గనుండును.

(3) సాయంకాలము పాడదగిన రాగము:—ఉ॥ నాద నామక్రియ. ఇది సయంత్రము 3 గం॥ మొదలు 6 గంట లవరకు పాడదగినది.

**3**.(a) రాగమాలికయొక్క లక్షణమేమనగా:—

ఇది 63వ, పుటయందుగల 1932వ సంవత్సరములోని 4వ బి,ప్రశ్నయొక్క జవాబునందు వ్రాయబడుటగమనించునది.

(b) ప్రసిద్ధమైన రాగమాలికల పేర్లువవనగా:—

ఉ॥ (i) నిత్యకల్యాణి. రాగమాలిక
సీతారామయ్య విరచితము.

(ii) శ్రీవిశ్వనాథం భజేహం
ముద్దుస్వామి దీక్షితుల విరచితము.

మహావైద్యనాథయ్యర్ గారిచే రచింపబడిన 72 మేళ కర్తరాగమాలిక ప్రసిద్ధరాగమాలికకు ముఖ్యఉదాహరణము.

(c) రాగమాలికలోని రాగములవరుసక్రమము ముఖ్య ముగాఆరాగమాలికయొక్క జాతిమీాదనే ఆధారపడియుండును.

వీనిలోకొన్ని, మేళకర్త రాగమాలికలలోవలెపైకైకలక్ష్యమునను సరించే క్రమమునకు కట్టుబడి రచించురాగమాలికలు గలవు. లేక దినరాగ మాలికావర్ణములలోవలె కవి తనస్వేచ్ఛానుసారముగా రాగములవరుస క్రమమును నిర్ణయించి రచియించే రాగమాలికలుగలవు. అయితేకవి రాగమాలికలోని రాగములయొక్క వరుసక్రమమును నిర్ణయించునపుడు, ఆయారాగభావముల రసము ననుసరించి సహజమైన పద్ధతిలో ఒకదానిననుసరించి వేరొకరాగము వచ్చునట్లుండవలెను. కాని ఎచ్చోటను అసందర్భముగ "కప్పగంతులు" వేసినట్లు ఎవరికి తోచగూడదు. ఇదేరాగమాలికలోని రాగములవరుస క్రమమును గురించిన నియమములని గమనించునది.

**4.** (a) (i) అష్టపది;—ఇది 108వ పుటయందుగల 1934 సం॥ లోని 5వ ప్రశ్నయొక్క 1వ జవాబునందు వ్రాయబడుట గమనింపదగును.

(ii) నౌకాచరిత్రము:— ఇది త్యాగరాజుగారిచే రచియింపబడినది.

ఇది ప్రహ్లాదభక్తివిజయమువంటి నాటకముగాదు. కనుకనేదీనిని "చరిత్రము" అనుపేర కవియే పిలిచియున్నాడు. మరియు దానిలోవలె అంకములు లేవు. కథ చరిత్రరూపముగావర్ణింపబడినది. ఇందలిరసము భక్తిమూలకమగు శృంగారము. దీనినే ఉజ్జ్వలరసము అనిభరతుడు పేర్కొని యున్నాడు. మృదుమధురములైన పదములతో నిది యిందుపోషింపబడినది. గేయములతోనిండి భక్తిశృంగార పోషకమైన యీగ్రంథము

సంస్కృతమునందలి జయదేవుడు వ్రాసిన (అష్టపది) గీతగో విందమును బోలియున్నది.

కథాసారాంశము.

రమాలోలుడైన నందాత్మజుడగు కృష్ణుడు గోపికల తోఁ క్రీడింప కుతూహలముగలవాడై దేవతలు మెచ్చునట్లుగా నౌకాక్రీడ (నావయందువిహారము) సేసి యావనగర్వితులగు వారికి హితముపదేశించుట.

కథా ప్రాశస్త్యము.

ఇయ్యది శ్రీహరియొక్క క్రీడాసంబంధమైన దివ్య చరి త్రమగుటచే నిదివిన్నవారు సన్మార్గముచే చిరంజీవులై చెలగుచు వరసుతధనములను బడసివర్ధిల్లుదురని కవియే జెప్పియున్నారు. ఇదే త్యాగయ్యగారి నౌకాచరిత్రముయొక్క సంక్షేపమైన వివరము.

(iii) ఘనపంచకము—అనగా రాగములలో ఘనరాగ ములనబడు నాట, గౌళ, ఆరభి, శ్రీ, వరాళియను 5ఘనరాగ ములను కలిపి ఘనరాగపంచకమనియు లేక ఘనపంచకమని యు జెప్పుదురు.

(iv) కంపితము—అనగా ఒక స్వరమును ఒక అక్షర కాలము కదలించి(〜)దానికి సమీపమునగల మీదిస్వరము యొక్క ఛాయను రానటుల జేయుట కంపితమనబడును. కంపి తము=కదలింపు

(b) కర్నాటక సంగీతములో 35 తాళములుగాక వా

మున్నయందు మరికొన్ని ఇతర తాళములుగలవు. అవిఏవనగా (i)దేశాదితాళము (ii)మధ్యాదితాళము (iii)చాపుతాళము.

(i) దేశాదితాళము:— అనగా ఇదిఒకవిసర్జితము, మూడుదెబ్బలుకలిగియుండును. సాధారణముగా నీతాళము న డుచువేగము నెమ్మదిగానుండును. విసర్జితములో $\frac{3}{4}$ అక్షరకాల ముచిశ్రాంతియైన పిమ్మట సంగీతముప్రారంభింపబడును. ఉ॥ శ్రీరంజని రాగమందున్న "భువినిదాసుడ" సరస్వతీ మనోహ రిరాగమందున్న "ఎంతవేడుకొందు రాఘవ" హరికాంభోజి రాగమందున్న "ఎందుకునిర్దయ" మొదలగునవి ఈతాళము గలపాటలకు ముఖ్య ఉదాహరణములు.

(ii) మధ్యాదితాళము:— అనగా దీనికి దేశాదితా ళమువలె ఒకవిసర్జితము మూడుదెబ్బలుండునుగాని తాళమున డుచువేగమంతనెమ్మదిగానుండదు. ఇందు విసర్జితములో $\frac{1}{2}$అక్ష రకాలమువిశ్రాంతియైన పిమ్మట సంగీతముప్రారంభింపబడును. ఉ॥ మణిరంగురాగమందున్న "రానిదిరాదు" శ్రీరాగమునం దున్న "నామకుసుమములు" మొదలగునవి యీతాళముగల పాటలకు ముఖ్యఉదాహరణములు.

(iii) చాపుతాళము:— ఇదిరెండుదెబ్బలుగలిగి యుం డును. ఇదిమూడువిధములు. (i) మిశ్రచాపు (ii) ఖండచాపు (iii) తిశ్రచాపు. (i) మిశ్రచాపు:—ఇందు మొదటిదెబ్బ 3 మాత్రలకాలము రెండవదెబ్బ 4మాత్రలకాలముకలదై యుం డును. (ii) ఖండచాపు:—ఇందు మొదటిదెబ్బ 2మాత్రలకా

లము రెండవదెబ్బ 3 మాత్రలకాలము గలదై యుండును. (iii) మిశ్రచాపు:— ఇందు మొదటిదెబ్బ 1 మాత్రకాలము రెండవదెబ్బ 2 మాత్రలకాలము గలదైయుండును. మాత్ర అనగా కాలమును దెలుపు అల్పమానమని యర్థము. కొన్ని కీర్తనలకుపైన చాపుతాళమని వ్రాసియున్న నవి సాధారణముగా మిశ్రచాపుఅని అర్థమిచ్చును. మిగతవివరములు ఈగ్రంథము నందుగల 9,10 పుటలందు జూడనగును.

**5.** (a) రాగముల చరిత్ర (లక్షణ)ముల నెరుగుటకు వేంకటమఖిగారి రాగాంగ (మేళకర్త) లక్షణగీతములత్యంతోపయోగకరమగుటచే ఇందలి విశేషణముల గుర్తించుటకెంతయు నుత్సాహముగ నుండును. సాధారణముగ నీ గీతములు 3 భాగములుగానున్నవి. అందు మొదటిభాగమున మేళకర్త రాగము యేరకపు స్వరములు తీసుకొనునో జ్ఞాపకమునకు సహాయమగు సూత్రపద్ధతి ననుసరించి చెప్పబడియుండును. రెండవభాగమున ఆ మేళకర్తనుండి జనించు ఉపాంగరాగముల వర్ణనను దెలుపబడియుండును. మూడవభాగములో అదే మేళకర్తరాగమునుండి జనించుభాషాంగరాగముల పట్టికను దెలుపబడియుండును.

వేంకటమఖివారు యీ లక్షణ గీతముల సాహిత్యము నందుదెలిపిన ఉపాంగరాగములలోకొన్ని అతని తదనంతరము భాషాంగరాగములుగా పరిగణింపబడుటచే వీనిలో కొన్ని రాగములుదక్షిణ హిందూదేశమున వర్తమానకాలమున ఆచరణలోలేకున్నను అచ్చువేయుట మెరుగని ఆరోజులలో కర్ణా

టక సంగీతమునగల అనేక రాగములయొక్క చరిత్ర(లక్షణ) ములదెలుసుకొని సులభముగా జ్ఞాపకముంచుకొనుటకు వీరిలక్ష ణగీతములుసంగీత విద్యార్థులకు అత్యంతోపయుక్తముగానుం డెను. ఈవిధముగాసాధకమైనవగుటచే వీరి రాగాంగలక్షణ గీతములకింత విలువవచ్చుటకు కారణమైనది.

(b) ముద్దుస్వామి దీక్షితులు చిన్నస్వామిదీక్షితునిమరణమువినగనే విరక్తుడైయుస్న బాలస్వామి దీక్షితునిజూడ ఎట్టయపురమునకు బోవుచుండెను. మార్గమధ్యమున వర్షము లేక యెండుచున్న పైరునుగని జాలిజెంది అమృతేశ్వరుని ధ్యానించి "ఆనందామృతకర్షిణి అమృతవర్షిణి" అనునొకకీర్తనమును అమృతవర్షిణి రాగములోరచించి శిష్యుడైన సుబ్రహ్మణ్యామునకు జెప్పుచుండెను. వెంటనేనిర్మలముగానున్నఆకాశమున దట్టమైననీలమేఘములుగలిగి రానురానభివృద్ధియై సైపరాని వర్షముగురిసెను. రేగటినేలయగుటచే మార్గమంతయు, బురదయగుటవలన సంకట పడుచు సాయంత్రమునకు యెట్టయపురముజేరి తమ్మునిగనిసంతసిల్లిరి. ఈయద్భుతవిశేషమువలన ముద్దుస్వామిదీక్షితులవారిచే రచింపబడిన "ఆనందామృతకర్షిణి" యనుకృతి యొకగొప్పవిశేషముగలదయని స్పష్టపడుచున్నది.

**6**. (a) ఈ క్రింది ముద్రలతో రచించిన వాగ్గేయకారకులెవరనగా:—

(i) "వేంకటేశ్వర" ముద్ర పట్నం సుబ్రహ్మణ్యయ్యర్
,, ,, మనంబుచావడివెంకటసుబ్బయ్యర్

(ii) పద్మనాభ" ముద్ర కులశేఖర మహారాజు (తిరువాన్కూరు)
(iii) "గర్భపురి" ,, కరూరు దక్షిణామూర్తి అయ్యర్
,, ,, ,, దేవుడు అయ్యర్
(iv) "ఉమాదాస" ,, ఆనయ్య(తంజావూరుసంస్థానవిద్వాన్)

(b) అరవ కీర్తనముల రచించిన 4 గురు వాగ్గేయ కారకులెవరనగా:—

(i) అరుణాచల కవిరాయర్ (ii) కవికుంజర భారతి (iii) గోపాలకృష్ణ భారతి (iv) ఆనయ్య.

## 7. (a) వీణావాద్యమునను గురించినవ్యాసము.



ఈపటమునందుగల వీణావాద్యముఅనాదికాలమునుండి హైందవుల ప్రసిద్ధ తంత్రీవాద్యమైయున్నది. ఇయ్యది అధికతమమైన శక్తిసామర్థ్యములుగల వాద్యము. పవిత్రగ్రంథములలో వీణ మానవశరీరమునుననుసరించి సృష్టింపబడినదని చెప్పబడినది. గనుకనే మానవగాత్రమును చక్కగాననుకరించగల శక్తిదానికి వచ్చినది. హిందూసంగీతమును అమూలాగ్రముగను, లక్ష్యలక్షణయుక్తముగను నేర్చుకొనుటకుమిక్కిలిసహాయభూతమగు వాద్యమువీణ. ఇందుగల స్వరముల వ్యవధులు

కొలతలుతదితరముఖ్యవిషయములయొక్క స్వభావము ఆయావీ ణల అమరికనుబట్టి తెలిసికొనవచ్చును. అత్యుత్తమమైన నీవీణా వాద్యప్రాశస్త్యమునుగూర్చి భరతముని ఈక్రింది విధముగా వర్ణించుట గమనించునది.

సీ॥ దండంబు శంభుఁడు తంత్రులు శాంభవి -
కమలాధినాథుండు కకుభమయ్యె
*పత్రికయిందిరా బ్రహ్మతుంబాకృతి -
నాభి సరస్వతి వైభవంబు
*దోరకరూపమై దొరయును వాసుకి -
చంద్రుండు జీవాళి సారెలినుఁడు
గావున నీ వీణ ఘనసర్వదేవతా -
మయమూర్తియై సర్వమంగళయగు ॥

గీ॥ బ్రహ్మహత్యాది పాతకపతితజనుల
పావనముజేయు ధర్శనస్పర్శనముల
స్వర్గభోగంబు మోక్షం బొసంగుననుచు
భరతముని దెల్పె రామభూపాలచంద్ర॥

* పత్రిక=రేకు. * దోరకము=నాగపాశము. లంగరు.

పైని దెలుపబడినటుల మోక్షసాధనమగు నీ వీణావా ద్యముయొక్క వివరముల నీక్రింద దెలుపబడుట గమనించునది.

(i) తంత్రుల వివరము:— వీణకు 7 తంత్రులుండును. అవి రెండు భాగములుగా నుండును. (i) మీాది తంత్రులు ఇవి నాలుగు. (ii) పక్క తంత్రులు ఇవి మూఁడు.

19

(ii) తంత్రుల ఉపయోగము (1) మీాది తంత్రులు:- ఇవి సంగీతము ప్రదర్శింపబడుటకు వుపయోగింపబడును.

(2) పక్క తంత్రులు:—ఇవి సంగీతమును ప్రదర్శించునపుడు తాళము వేయుటకుమాత్రము వుపయోగింపబడును. గనుక తాళతంత్రులని చెప్పబడును. ఇందు శృతికూడ లీనమై యుండును.

(iii) తంత్రులు వేయువిధము:-వీణకుగలన ప్తతంత్రులను మూలాధారమువద్ద ముడివైచి మీాది నాలుగు తంత్రులను కంఠమువద్దనుండు చెవులకును పక్కతంత్రులు మూడును దండము పక్కనుండు చెవులకును చుట్టుదురు.

(iv) తంత్రులశృతి చేయువిధము:-మీాది తంత్రులలో మొదటి తంతిని అను మంద్రపంచమముగను, రెండవ తంతిని మంద్రషడ్జముగను, మూడవతంతిని మంద్ర పంచమముగను నాల్గవతంతిని మధ్యషడ్జముగను, పక్క తంత్రులలో మొదటి తంతిని మధ్యషడ్జముగను, రెండవ తంతిని మధ్యపంచమము గను, మూడవ తంతిని తారషడ్జముగను శృతి చేయవలెను.

(v) మెట్లవివరము:-వీణకు ముఖ్యముగా 24 మెట్లుండును. ఒక్కొక్కస్థాయికి 12 స్వరముల వంతున 2 స్థాయిలకు గల 2×12=24 స్వరములకు 24మెట్లు అమర్చబడి యుండును. శిరస్సునగల మేరువ మెట్టుతో 25 అగును. ఈ 25ను, యోగ శాస్త్రము ననుసరించి 25 తత్వములుగా పోల్చబడియున్నవి.

(vi) వేళ్ళ నుపయోగించువిధము:—కుడిచేతి వేళ్ళను

తంత్రుల మీటుటకును, ఎడమచేతివేళ్ళను తంత్రులను మెట్ల మీద నదిమిలాగుచు స్వరముల బలికించుటకును వుపయోగించుదురు.

(vii) మీటెడుకొరముట్లు:-(i) నిడుపైన వేళ్ళగోళ్ళు. (ii)దంతము లేక ఉక్కుతో చేయబడిననఖములుపయోగించుదురు

(viii) అభ్యసించువిధము:- మొదట మాయామాళవగౌళరాగమునందుస్వరావళి, దాటువరుస, హెచ్చుస్థాయివరుస, అలంకారాదులును తదుపరి గీత, స్వరజతి, తానవర్ణ,కృతి, కీర్తన, పద, జావళ్యాదులను, ఆయాస్వరస్థానముల ననుసరించి ఎడమచేతి చూపుడు, మధ్యమ వేళ్ళతో తంత్రుల నదిమి లాగుచు కుడిచేతిచూపుడు మధ్యమ వేళ్ళతో తంత్రుల మీటుచుగానమొనర్చునపుడు ఆయాగేయములందుగల తాళఘాతల ననుసరించి చిటికెనవేలుతో తాళతంత్రులమీటుచు వీణావాద్యమునభ్యసింపవలెను. పిమ్మట గాయకుని శక్తికి దగినటుల రాగము, తానము, పల్లవి, స్వరము మొదలగునవి విచిత్ర కల్పనలతో మనోరంజకమగునటుల అభ్యసింపవలెను. ఇదే వీణావాద్యమునుగురించిన సంక్షేపమైనవ్యాసము.

## (b) వీణావాద్యము యొక్క సంక్షేపమైన చరిత్రము.

సంగీతవాద్యములలో మిక్కిలి పవిత్రమైనవీణయొక్క జన్మస్థానము స్వర్గము. విద్యాధిష్టాన దేవతయైన సరస్వతి సంగీతము నభ్యసించినదీవాద్యము మీదనే. దేవలోకమునందలి నారదాది మునిముఖ్యులందరు ఆనందసుధ గ్రోలునది ఈవీణాగా

నమునుండియే. నారదుడు త్రిలోకసంచారియగుటచే వీణావాద్యమును భూలోకమునకు తీసికొనివచ్చెను. వీణావాద్యమునందలి గానసుధారసమును తెలిసికొనిన అచ్చటిఋషులును తదితర మహానుభావులును క్రమముగా వీణవాయించుట నేర్చుకొనిరి. కాని దాని నిజమైనవిలువను, దానిలో నిమిడియున్న ఆనందమునుచాలమంది తెలిసికొనజాలక పోయిరి. ఇయ్యది వాద్యములన్నిటిలో ప్రప్రథమమున నుత్పత్తియైన వాద్యమగుటచే వాద్యములకు మాతయని చెప్పుటకెంతేయు తగియున్నది.

ప్రస్తుతము హిందూదేశములో వీణ బహుకొద్దిమందిచేతనే అభ్యసింపబడుచున్నది. హిందూదేశములోని వివిధభాగములలో వాడబడు వివిధరకములైన వీణలలో ఆకారమునందును సంగీతమాధుర్యమునందును దక్షిణహిందూదేశపువీణలు అత్యుత్తమమైనవి. విఖ్యాతిగాంచిన యీవీణావాద్యమునందు ప్రావీణ్యముసంపాదించవలెననిన అధికపట్టుదల, కార్యదీక్షవిశేషముగానుండవలెను. అయ్యవి అత్యంతశ్రమసాధ్యములగుటచే కొందరే యీకళయందుతీర్ణులై యిందలిగానమాధుర్యము గ్రోలిసంతృప్తులగుచున్నారు.

హిందూదేశములో వీణావాద్యముయొక్క అభివృద్ధికి గాను తగిన ప్రయత్నము లేకున్నవి. కానయిటీవల మైసూరు, విజయనగరం, తిరువాన్కూరు మొదలగు సంస్థానాధీశ్వరులగు మహారాజులయొక్క ఆదరాభిమానమున నీవీణావాద్యము తిరిగి అభివృద్ధిజెందుటకు హేతువైనది. పై విషయములే యీవాద్యముయొక్క సంక్షేపమైన పూర్వ,వర్తమాన చరిత్రాంశములు.

## 8. శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్య విరచితము.

### సావేరిరాగము - ఆదితాళము.

ప. ఎటునమ్మినావో మనసా – ఇంచుకైన యోచనజేయలేక (ఎటు)

అ. చిడుగంటి రోగపీడితమై – చెడిక్షీణించే దేహముస్థిరమని (ఎటు)

చ. మట్టికుండకంటె హీనమైనదిది – మాటిమాటికిని రాదు దీనిపై –
వట్టి మోహముజెందుచును – వరద వేంకటేశ్వరునిమరచి (ఎటు)

ప. ; ; ;* సారీమా;–మా । రిమపా;–రిమ । పా–మపధా–నిధ ॥
; ; ;* ఎటున ;–మ్మి । నా. . ;–వో. । . –మ. . –న. ॥

2.పమ–గరిసధ* సారీమా;–మ ప । గా;రీ–మ ప । ధనిధా;–నిధ ॥
. .–సా. . .* ఎటున ;–మ్మి. । నా; .–వో. । . . మ ;–న. ॥

3.పమ–గరిసధ* సారీమాగా– ధ ప । పమగా,రి–మప । ధా–పధసా–నిధ ॥
. .–సా. . .* ఎటున . –మ్మి . । నా. . , .–వో. । . –మ. . –న . ॥

1.పమ–గరిసధ* ప ధపమ–గా;రీ । సా ;;– రిప । పమ–పధనీధా– ॥
. .–సా. . .* ఇం.చు. –కై ;న । యో;;–చ. । న .–జే. . య– ॥

2. నిధపమగరి* ప ధపమ–గా;రీ । సా ;రీ–మప । ధస–రిగరిస– నిధ ॥
లే. . . క.* ఇం .చు. – కై;న । యో.–చ . । న .–జే. . .–య. ॥
పమ–గరిసధ*
లే .–. .క .* (ఎటు)

అ. ; ; ;* రీ రీ – రీ; రీ । సా;;–సని । ధా–సరిగారీ ॥
; ; ;* చిడు–గం;టి । రో;;–గ . । . –పీ. . డి ॥

గా,గారి* ,, | సరిగరిరిస-సని | ధా-సరిగారీ ||
2. త,మై.* ,, |రో.....-గ. | .-షీ..డి ||

గా,గారి* సరిగా-రిగరీసా |ససరిసనిధ-ధధ | గ రిసా;-నిధ ||
త,మై.* చె.డి -క్షీ..ణిం |చే....-దే. | హ .ము;-సి. ||
పమ-గరిసధ*

ర.-మ.ని.* (ఎటు)

చ. ; ; ;* పాధా పా;పా- | ప మధా;-పని | ధప-మగరిసరీ ||
; ; ;* మ ట్రి శం; డ- | కం. కై;-హీ. | న .-మై...న ||
మా,మా,* మపధనిధా-ధపమా | గ రిరీ;-ప ధ | పమ-గా;రీ ||
ది , ది,* మా.టి.మా-... | టి .కి;-రా. | దు. -దీ ;ని ||

సా; ;* రీ రీ- రీ ; రీ | సా;;-స ని | ధా-సరి గారీ ||
పై; ;* వ ట్టి-మో;హ | ము;;-జెం. | .-దు... ||

గా,గా,* రీ రీ- రీ ; రీ | సరిగరిరిస-సని | ధా-సరిగారీ ||
చు..,* వ ట్టి-మో:హ | ము....-జెం. | .-దు... ||

గా,గారి* సరిగా-రి గరీసా- | ససరిసనిధ-పధ | సరిగ రిసా-నిధ ||
చు,..* వర ద-వేం.. క- |టే.శ్వ...-రు. | ..ని..-మ. ||
పమగరిసధ*

ర.చి...* (ఎటు)

N. B. ఈ గ్రంథమునగల ఒక్కొక్క సంవత్సరములోనుండు ఆయాప్రశ్న లననుసరించి ఒకరాగములోని కృతినిగాని వాని భాగములనుగాని స్వరపరచి వ్రాయబడినది. మిగతరాగములలో గల కృతులనుగూడ స్వరసాహిత్య తాళాంగములతో దెలియగోరినవారు నాచే లోగడ రచింపబడిన **"గానకళాచంద్రిక"** యందుండుట గమనింపదగును.

# 72 మేళకర్తలు వానిస్వరములను దెలుపు పట్టిక.

## స, ప = అన్నిటికి సమము

| పూర్వమేళకర్తలు లేక శుద్ధమధ్యమ మేళకర్తలు | రి | గ | ధ | ని | ఉత్తరమేళకర్తలు లేక ప్రతిమధ్యమ మేళకర్తలు |
|---|---|---|---|---|---|
| (i) ఇందుచక్రము. | | | | | (vii) ఋషిచక్రము |
| 1 కనకాంగి | శు | శు | శు | శు | 37 సాలగము |
| 2 రత్నాంగి | ,, | ,, | శు– | కై | 38 జలార్ణవము |
| 3 గానమూర్తి | ,, | ,, | శు– | కా | 39 ఝాలవరాళి |
| 4 వనస్పతి | ,, | ,, | చ– | కై | 40 నవనీతము |
| 5 మానవతి | ,, | ,, | చ– | కా | 41 పావని |
| 6 తానరూపి | ,, | ,, | ష– | కా | 42 రఘుప్రియ |
| (ii) నేత్రచక్రము. | | | | | (viii) వసుచక్రము |
| 7 సేనావతి | శు | సా | శు | శు | 43 గవాంభోధి |
| 8 హనుమతోడి | ,, | ,, | శు– | కై | 44 భవప్రియ |
| 9 ధేనుక | ,, | ,, | శు– | కా | 45 శుభపంతువరాళి |
| 10 నాటకప్రియ | ,, | ,, | చ– | కై | 46 షడ్విధమార్గిణి |
| 11 కోకిలప్రియ | ,, | ,, | చ– | కా | 47 సువర్ణాంగి |
| 12 రూపవతి | ,, | ,, | ష– | కా | 48 దివ్యమణి |
| (iii) అగ్నిచక్రము. | | | | | (ix) బ్రహ్మచక్రము. |
| 13 గాయకప్రియ | శు | అం | శు | శు | 49 ధవళాంబరి |
| 14 వకుళాభరణము | ,, | ,, | శు– | కై | 50 నామనారాయణి |
| 15 మాయామాళవగౌళ | ,, | ,, | శు– | కా | 51 కామవర్ధని |
| 16 చక్రవాకము | ,, | ,, | చ– | కై | 52 రామప్రియ |
| 17 సూర్యకాంతము | ,, | ,, | చ– | కా | 53 గమనశ్రమ |
| 18 హాటకాంబరి | ,, | ,, | ష– | కా | 54 విశ్వంభరి |

| పూర్వమేళకర్తలు లేక శుద్ధమధ్యమ మేళకర్తలు | స్వరములు రి | గ | ధ | ని | ఉత్తరమేళకర్తలు లేక ప్రతిమధ్యమ మేళకర్తలు |
|---|---|---|---|---|---|
| (iv) వేదచక్రము. | | | | | (x) దిశిచక్రము. |
| 19 ఝంకారధ్వని | చ | సా | శు | శు | 55 శ్యామలాంగి |
| 20 నఠభైరవి | ,, | ,, | శు– | కై | 56 షణ్ముఖప్రియ |
| 21 కీరవాణి | ,, | ,, | శు– | కా | 57 సింహేంద్రమధ్యమము |
| 22 ఖరహరప్రియ | ,, | ,, | చ– | కై | 58 హేమవతి |
| 23 గౌరీమనోహరి | ,, | ,, | చ– | కా | 59 ధర్మవతి |
| 24 వరుణప్రియ | ,, | ,, | ష– | కా | 60 నీతిమతి |
| (v) బాణచక్రము. | | | | | (xi) రుద్రచక్రము |
| 25 మారరంజని | చ | అం | శు | శు | 61 కాంతామణి |
| 26 చారుకేశి | ,, | ,, | శు– | కై | 62 రిషభప్రియ |
| 27 సరసాంగి | ,, | ,, | శు– | కా | 63 లతాంగి |
| 28 హరికాంభోజి | ,, | ,, | చ– | కై | 64 వాచస్పతి |
| 29 ధీరశంకరాభరణము | ,, | ,, | చ– | కా | 65 మేచకల్యాణి |
| 30 నాగానందిని | ,, | ,, | ష– | కా | 66 చిత్రాంబరి |
| (vi) ఋతుచక్రము. | | | | | (xii) ఆదిత్యచక్రము. |
| 31 యాగప్రియ | ష | అం | శు | శు | 67 సుచరిత్రము |
| 32 రాగవర్ధని | ,, | ,, | శు– | కై | 68 జ్యోతిస్స్వరూపిణి |
| 33 గాంగేయభూషణి | ,, | ,, | శు– | కా | 69 ధాతువర్ధని |
| 34 వాగధీశ్వరి | ,, | ,, | చ– | కై | 70 నాసికాభూషణి |
| 35 శూలిని | ,, | ,, | చ– | కా | 71 కోసలము |
| 36 చలనాట | ,, | ,, | ష– | కా | 72 రసికప్రియ |

